25-9-1992 శుక్రవారం 12 పేజీలు సంపుటి : 63 సంచిక :39 విడిప్రతి : రు. 2.00 లు

Regd. No. H.N.L. 18

# జమీన్ రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకటరామానాయుడు



# కొండంత బలం నిష్ఫలం!

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. జనార్ధన రెడ్డి పదవీ పరిత్యాగం చేస్తున్నారు. మరి మూడు రోజుల తర్వాత ఆయన మాజీ ముఖ్యమంత్రి. 28తేది సాయంత్రం రాజీనామా పత్రాన్ని గవర్నర్‌కు సమర్పించడానికి ఏర్పాట్లు సిద్ధమైపోయాయి.

రాజకీయాలలో ఆత్మహత్యలే తప్ప, హత్యలుండవన్న నానుడి జనార్ధనరెడ్డి విషయంలో అక్షరాలా నిజమైంది. ఇది ఆత్మహత్య కూడా కాదు, ఆత్మాహుతి. ప్రత్యర్థు లెందరు, ఎన్ని రకాలుగా ప్రయత్నించినా జరగని పనిని, తన చేతులమీద తానే చేసుకున్నారు. పదేళ్ల సుదీర్ఘరాజకీయ పోరాటం, నిర్విరామ శ్రమలతో సాధించిన ఫలాన్ని చేజేతులా చేజార్చుకున్నారు. జనార్ధనరెడ్డి రాజకీయ జీవితంలో ఒక స్వప్నం భగ్నమైంది; ఒక స్వర్గం బుగ్గిపాలైంది.

ఎవరి ప్రీత్యర్థమో, ఎవరి ప్రోద్బలంతోనో చేసిన మెడికల్ కాలేజీల

> మూడు వంతుల ఎమ్మెల్యేలు మద్దతుపల్కినా పివి పాశుపతాస్త్రం ధాటికి జనార్ధన రెడ్డి నిలువ లేకపోయాడు!

మంజూరు నిర్ణయం ముఖ్యమంత్రి మెడకు యమపాశంగా పరిణమిస్తుందన్న సంగతి తొలిరోజే అనుభవజ్ఞులైన రాజకీయ పండితులందరూ పసిగట్టారు. కాని జనార్ధనరెడ్డి మాత్రం ఆ వాస్తవాన్ని అంగీకరించలేక పోయారు. అతిశయించిన ఆత్మవిశ్వాసం, మెరమెచ్చు మాటలతో తమ పబ్బం గడుపుక పోయేవారు మాత్రమే చుట్టూ చేరడం, నిజపరిస్థితుల అవగాహనకు ఆయనకు అవకాశం కల్పించలేదు. ప్రతిష్ఠకు, పట్టుదలకు పోకుండా, విమర్శలు రాగానే, నిందకు ఆస్కారం కల్గుతున్నదని తెలియగానే మెడికల్ కాలేజీల జీఓను రద్దుచేసి వుంటే, ఇప్పుడీ పరిస్థితి ఏర్పడేది కాదు. పరిణామం ప్రమాద కరంగా వుండబోతుందని తెలిసీ జనార్ధనరెడ్డి ఆ తప్పు చేశాడు; చేతులు కాలిపోయాయి.

ఆ ఒక్క తప్పు తప్ప, ఆ స్వయం కృతాపరాధం తప్ప, జనార్ధనరెడ్డి పదవీ భ్రష్టతకు మరే కారణం కన్పడదు.

కొరవ 6 పేజీలో



చేజారెను 'ఫలం'; చింతించి ఏమి ఫలం?

# జమీన్‌రైతు
## వెనుకటి బుద్ధులు...

కనకపు సింహాసనంపై కాదు, స్వర్గంలో కూర్చుండబెట్టినా కాంగ్రెస్ వాదులు వెనుకటి బుద్ధులు మానలేరని రుజువైపోయింది. ఏడేళ్ల అధికారలేమి వారిలో ఏ మార్పు తేలేక పోయింది. సాక్షాత్తు ఎఐసిసి అధ్యక్షుడితో సహా కాంగ్రెస్ సంస్థలోని ప్రతి నాయకుడి తత్వం, ఆలోచనా ధోరణి ఒకే తీరులో నడుస్తున్నాయని తేలిపోయింది. రాష్ట్రంలో కాంగ్రెస్‌ను మరొకసారి భూస్థాపితం చేయడానికి ప్రతి ఖద్దరు ధారీ శక్తివంచన లేకుండా కష్టపడుతున్నారని ప్రజలకు అర్థమైపోయింది.

1978-83ల మధ్య ఏ తప్పులైతే చేశారో, ఇప్పుడు వాటినే తుచ తప్పక పునరావృతం చేస్తున్నారు. గద్దెనెక్కిన ఏ ముఖ్యమంత్రినీ గట్టిగా పదినెలలు పరిపాలించ నివ్వకుండా అసమ్మతి పేరిట ఆటంకాలు కల్పించి, ఐదేళ్ల కాలంలో నలుగురు ముఖ్యమంత్రుల మార్పుకు కారకులై, కాంగ్రెస్‌పట్ల ప్రజలలో ఏహ్యభావం జనింప జేశారానాడు. దాని ఫలితం ఏడేళ్లపాటు అనుభవించారు. కాంగ్రెస్ వాదులకు పదవులు మాత్రం పోయాయి; ఆంధ్రులు ఏడేళ్ల తెలుగుదేశం దుష్టపరిపాలనలో రాష్ట్ర భవిష్యత్తునే నాశనం చేసుకున్నారు.

నాయకత్వం మార్పుకోసం గత ఆరు నెలలుగా జరుగుతున్న భాగోతం చూస్తే మళ్ళీ రాష్ట్రానికి అటువంటి దుష్పరిపాలన తప్పదా అన్పిస్తుంది. జనార్దనరెడ్డిని దించడంలోనే కాదు, కొత్తనాయకుడిఎంపికలోనూ కాంగ్రెస్ పెద్దలు పాత పొరపాట్లు చేస్తున్నారు. కొత్త ముఖ్యమంత్రి ఎంపికలో శాసన సభ్యుల మాటకు ఏమాత్రం విలువ, గౌరవం వుండేటట్లు కన్పించడం లేదు. ఇందిరా గాంధీ, రాజీవ్‌గాంధీల వలె పివి నరసింహారావు సైతం తన తాబేదారుని కొత్తనాయకుడిగా ఎంపిక చేయించడానికి ప్రయత్నిస్తున్నాడే తప్ప, ప్రజాస్వామ్య సాంప్రదాయాలు పాటించి, సిఎల్‌పిలో బలబలాల పరీక్ష పెట్టడం లేదు. ఢిల్లీనుంచి ముద్రకొట్టుకొని వచ్చే వ్యక్తి ముఖ్యమంత్రి అయితే, మళ్లీ ఆరునెలలు తిరగక ముందే అసమ్మతి అధ్యాయం ప్రారంభం కావడం తథ్యం. తన కాళ్లపై తాను నిలబడలేని వారి చేతిలో రాష్ట్రాన్ని పెడితే జరగబోయేది ఏమిటో అంజయ్య, భవనం వంటి వారు చూపించారు.

చీటికి మాటికి ముఖ్యమంత్రులను మార్చడం, సిఎల్‌పిలను తమ నిర్ణయాలపై ముద్రవేసే రబ్బరు స్టాంపుల వలె తయారు చేయడం పివి వంటి విజ్ఞుడు చేయదగిన పనికాదు. జనార్దనరెడ్డి రాజీనామా కోరే విషయంలోనే పివి కాంగ్రెస్ పెద్దగా కాక, వ్యక్తిగత ఈర్ష్యద్వేషాలు దాచుకోలేని సగటు కాంగ్రెస్‌వాదివలె ప్రవర్తించాడు. కొత్త నాయకత్వం విషయంలోనూ ఎటూతేల్చి చెప్పక, ఊహాగానాలకు ఆస్కారమిచ్చి, గోచి, మొలతాడు లేనివాడు సైతం ముఖ్యమంత్రిత్వం కోసం పోటీపడే పరిస్థితి కల్పించి, కాంగ్రెస్‌ను నవ్వుల పాల్జేస్తున్నాడు. ఆరు నెలలుగా అసమ్మతిని ఎగద్రోసి పార్టీపట్ల ప్రజలలో చులకన భావాన్ని కల్గించాడు. దాని ప్రభావం నూతన నాయకుడిపై సైతం వుండడం తథ్యం. ఢిల్లీ నుంచి పంపే ఏ నాయకుడి కైనా అసమ్మతితో సమరం చేయక తప్పదు. ఇప్పటికే ప్రజలలో కాంగ్రెస్‌కు తిరిగి అధికారం ఇచ్చి తప్పు చేశామన్న భావంవుంది. ఎన్నికలకు రెండేళ్లు కూడా వ్యవధిలేని పరిస్థితులలో ఈ ప్రహసనం మరొక సారి పునరావృతమైతే, గోరీ దగ్గర నక్కవలె కాచుకొని వున్న తెలుగు దేశం అధికారాన్ని తన్నుక పోవడం ఖాయం.

అసలు, ముఖ్యమంత్రిని రెండేళ్ల పాటైనా పనిచేయనివ్వని పరిస్థితి కల్పిస్తే, ఎవరు మాత్రం ఏమి చేయగల్గుతారు? ఏ విధాన నిర్ణయం తీసుకొని అమలు జరుపగల్గుతారు? పివి, ఇప్పటికైనా తన తప్పు తెలుసుకొని నూతన నాయకుడి ఎంపికలోనైనా శాసన సభ్యులకు స్వేచ్ఛనివ్వడం మంచిది. ముఖ్యమంత్రి ఎవరు అనేది ఢిల్లీ స్థాయిలో వుండేవారికి పెద్ద సమస్య కారాదు; కాంగ్రెస్ ఎన్ని రాష్ట్రాలలో ప్రజాభిమానం పొందగల్గుతున్నది అన్నదే పరిశీలనాంశం కావాలి. వారిలో ఆ విశాల దృక్పథం అలవడకుంటే, రాష్ట్రాలలో కాంగ్రెస్ నాయకుల బుద్ధి మారదు; 94లో పార్టీ రాతనూ ఎవరూ మార్చలేరు.

## జమీన్‌రైతు

[సభలు, సమావేశాల రిపోర్టింగులోనూ జమీన్‌రైతు స్థాపక సంపాదకుడు స్వర్గీయ నెల్లూరు వెంకట్రామానాయుడు గారిది విలక్షణ శైలి; నెల్లూరులో జరిగిన రెడ్డి మహాజన సభపై 50 ఏళ్ల క్రితమే ఆయన ఎంత నూతన తరహాలో వార్త వ్రాశారో చదవండి. 14.9.45 సంచిక నుంచి పునర్ముద్రితం]

### రెడ్డిసభా దృశ్యాలు

-చిత్రగుప్తుడు

నమోరెడ్డి యతీశ్వరాయః
నమోరెడ్డి కవీశ్వరాయః
నమోరెడ్డి బుదేశ్వరాయః
నమోరెడ్డి కళేశ్వరాయః

* * *

"విన్నంత కన్నంత తెలియవ
చ్చినంత............"

* * *

మంచి చెడ్డలు ఒకమాటు సింహావలోకనం చేద్దామనుకున్నాను. నచ్చినా నచ్చకున్నా

"కొందరికి నింద గుణమగు
కొందరికిని ప్రస్తుతింప గుణమగుగాని
అందరి మెప్పింప నాయబ్బ
కైన సాధ్యమా"

విద్యానిధి విషయంలోగూడా గద్వాల్ మహారాణి గారి 5వేలు. వనపర్తివారి సాంవత్సరిక విరాళం గాక 5వేలు, యావజ్జీవ సభ్యులబాపతు 10వేలు, వెరసి యీ సభల సందర్భంగా ఇక్కడ 20వేలు సమకూడినట్లే.

ఇదిగాక ఆహ్వానసంఘ సభత్వపు చందాల రూపేణ వసూలయిన 10వేలలో ఖర్చులుపోను నిల్వ నెల్లూరులో నిర్మింపబోవు "గొండవీడు" హాస్టలు భవన నిర్మాణానికి పునాది కాగలదనుట సంతోషవార్త. సైపూరు వారి రెడ్డిహాస్టలులో ఖాళీవున్నప్పుడు ఇతర జాతి విద్యార్థులకు అవకాశ మిచ్చినట్లుగాక, ఈ గొండవీడులో అన్ని జాతులకు అవకాశమిచ్చునట్లు విశాల దృక్పథాన్ని చూపుదురుగాక.

* * *

ఉపన్యాసాల్లో స్వాగత సంఘాధ్యక్షులు తిక్కవరపు రామిరెడ్డిగారి ఉపన్యాస రాజం కులమత వివక్షతల దాటి విశాల భావ ప్రపంచంలో సంచరించి రెడ్డిగారి మనో పరిపక్వతకు ప్రతిబింబంగా వున్నది.

తక్కిన ఉపన్యాసాలలో చెప్పదగిన విశేషత లేదు. కాని, గోపాల

### పాత సంపుటాల్లో

రెడ్డి, గురవారెడ్డి, కోటిరెడ్డి, డి. రామలింగారెడ్డి గారల ఉపన్యాసాలలో మాత్రం కాంగ్రెసు రాజకీయ మలయమారుతం కొద్దిగా తొంగిచూస్తూ వుండినది.

ఇక సి.ఆర్.రెడ్డిగారి ఉపన్యాసంలో 25సంవత్సరాల పౌరోహిత్య మంత్రాలు, మునగాల ప్రవచనాల్లో వృద్ధాశీర్వాద గీతాలు, గద్వాలరాణిగారి పరోక్షధ్వనులలో శ్రీ విద్యాది ధర్మ పన్నాలు, రామసుబ్బమ్మ గారి ఉపన్యాసంలో 10లక్షల సంఘనిధి అభ్యర్థన ప్రబోధగీతాలు, రామచంద్రా రెడ్డిగారి వందన సమర్పణలో చరమ సువాసనలు ఘుమాళించినవి.

* * *

రెడ్డి సంఘంలో వరకట్న దురాచారాలు విపరీతంగా పెరిగి కూర్చున్నవి. ఈ తీర్మానం వచ్చినపుడు రెడ్డి యువకులచేత ప్రమాణాలు చేయించివుంటే రెడ్డి బాలికల చేత ఉపన్యాసరీత్యా యువకులకు ప్రబోధం చేయించియుంటే ఎంతో ప్రయోజనం వుండేది. ఆ తీర్మానం చిముగుట్టినంత చప్పుడు గూడా లేకుండా ప్యాసైంది. నాగిరెడ్డిగారు వరకట్న, కన్యాశుల్కాలు నిషేధిస్తూ చట్టం గావాలన్నారు సింధుమాదిరి.

ఏలూరు యువకలాయర్ యం. ఆర్.కృష్ణారెడ్డి రెడ్డియువకులను సైన్యంలో చేరమని తీర్మానం తెచ్చారు. పాపం! అక ప్రాణభయం లేదనుకొన్నారు కాబోలు! నాలుగు చీవాట్లతో ఆ తీర్మానం వీగిపోయిందిలెండి.

రెడ్డిజనసంఘ అతిథుల భోజనసంతర్పణ సమారాధన డిన్నరులు మన చక్కెర రెడ్డిగారి ఖర్చుల తోనే తుష్టిగా జరిగిపోయినవి.

దువ్వూరు రామిరెడ్డిగారి కమ్మటి మధుర సాహిత్య సంపుటీకరణ కర్తలు రేబాల సుబ్బరామిరెడ్డిగారు వెయ్యిమంది రెడ్డి మహాసభ సహాయమానులకు తియ్యటి తేనీటివిందనర్చిరి.

* * *

అద్యంతాలవలోకిస్తే ఎక్కడా అన్యకుల ద్వేషం గాని, స్వోత్కర్షగాని కనిపించదు. నిధిసేకరణ, విద్యాదానం, రెడ్డిజనసంఘ ఏకీకరణ, యివే సభారంగంలో నడచిన వృత్తాంతాలు. మహాసభ మహా సముద్రంవలె గంభీరంగా, విశాలంగా, చల్లగా, నెమ్మదిగా జరిగిపోయింది.

# జనవాణి

## ఇకనైనా పార్టీ పరువు నిలపండి

ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్య మంత్రులను తరచూ మార్చే విష సంస్కృతి దిన దిన ప్రవర్ధమానమవడం కాంగ్రెస్ పార్టీ అభిమానులను బాధ పెడుతున్నది. ఎన్నో ఆటు-పోట్లను ఎదుర్కొని రాష్ట్రంలో కాంగ్రెస్ అధికారానికి వచ్చిన విషయం అధిష్టాన వర్గం మరచి పోవడం శోచనీయం. ఇంతకు మునుపు ముఖ్యమంత్రులను మార్చి, మార్చి చివరికి జనంచేత తిరస్కరింప బడ్డ విషయాన్ని ఒకసారి సింహావలోకనం చేసుకోవాలి. ఏ ముఖ్యమంత్రైనా పట్టుమని పదినెలలు పాలించక మునుపే సమ్మతి అసమ్మతి రాగాలు పాడడం ఆటీవల పరిపాటయ్యింది. పనులు జరిగితే సమ్మతి! లేకుంటె అసమ్మతి! ఇదా కాంగ్రెస్ సంస్కృతి? ఇప్పటికి పదవిలో కొచ్చిన పలువురు శాసన సభ్యుల కంటె పార్టీని అభిమానించే ఎక్కువ మంది కార్యకర్తలకు ఈ చర్యలు వెగటు కల్గిస్తున్నాయని మరవ కూడదు. చెన్నారెడ్డి, రాజశేఖర రెడ్డి, విజయభాస్కర రెడ్డి, రామచంద్రారెడ్డి, సమరసింహారెడ్డి, శ్రీపాదరావు... వీరిలో ఎవరు పదవిలోకొచ్చినా 'అవినీతి'కి దూరం ఉండి పార్టీ పరువు నిలిపే పనులు చేయండి నాయనా!

-పి. అరుణమ్మ

నెల్లూరు.

### నాటికి -నేటికి తేడా

ఆనాడు మద్యపానాన్ని అప్పటి ముఖ్యమంత్రి శ్రీ ప్రకాశం పంతులు నిషేధిస్తారని 'సారా' ప్రియులంతా పోటీలుపడి కల్లు, సారాను తీవ్రంగా తాగి మత్తులో ఊగారు. కాని ఆయన దాన్ని నిషేధించలేదు. 1955లో శ్రీ బెజవాడ గోపాలరెడ్డి సర్వేపల్లి నియోజక వర్గంలో ఎన్నిక ప్రచారానికి వచ్చి సారా నిషేధిస్తానని చెప్పి, తీవ్ర విమర్శలు వచ్చేసరికి అనంతపురం సభలో 'నీరా'(కల్లు పానీయం) అంగళ్లు ఉంచేటట్లు చేస్తానని చెప్పడం జరిగింది. అప్పటి ఈ చర్యలవల్ల కాపుసారాకాసి, కత్తి కల్లు అమ్మి గౌడకులస్తులు నేరు బాగా నిలదొక్కుకొని ఫింకారాలు చేస్తున్నారు. ప్రస్తుతం జిల్లాలో జరుగుతున్న సారా నిషేధోద్యమం చూస్తే మళ్లీ పూర్వపు రోజులు గుర్తుకొస్తున్నాయి. మన ముఖ్యమంత్రి పంతం నెరవేరుతుందో, మహిళల పంతం నెగ్గుతుందో వేచిచూడాలి మరి.

-ఈపూరు వెంకురెడ్డి

గుడ్లూరు వారి పాళెం.

### పెన్నవర్ల గోడు వినండి

1961నుండి 1973 సంవత్సరాల మధ్య పదవీ విరమణ చేసిన

అడ్డు వస్తే లారీతో త్రొక్కించి చంపుతారు; స్టేషన్‌లోనే పోలీసులను తిడుతున్నారు!

# వీరప్పన్‌ను తలపిస్తున్న తడ స్మగ్లర్లు!

తడ నుంచి నిత్యం జరిగే ...లు, ధాన్యం స్మగ్లింగ్‌లో అధికారుల ...యం. పాత్ర అర్థం చేసుకోగల్గితే, ...త్వ యంత్రాంగం పట్లనే అసహ్యం, ...వం కల్గుతాయి. విజిలెన్స్, నింద కాదు. ఏ మాత్రం సందేహించనవసరం లేని వాస్తవం. ప్రభుత్వాధికారులలో అవినీతి వుంటుంది కాని. లంచాలు తినడమే తమ విధి నిర్వహణ అనే నీచాతి నీచ మానసిక ట్యాక్సెస్, రవాణా ఉద్యోగాలకు, సూళ్లూరు పేట చెక్‌పోస్టులో సివిల్ సప్లయిస్ పోస్టింగులకు, ఈ ప్రాంతం విజిలెన్స్, పోలీసు ఉద్యోగాలకు, స్పష్టమైన, ఖచ్చితమైన రేట్లున్నాయి. వాటి విలువ హైదరాబాదులోని అధికారులకు, నేతలకు కూడా తెలుసు. ఇక్కడి పోస్టింగులకు అక్కడే వేలంపాట జరుగుతుంటుంది. ఒక బ్రేక్ ఇన్స్‌పెక్టరు తడలో తనకు పోస్టింగు ఇప్పిస్తే 3 లక్షలు ఇస్తానని నేరుగా రవాణామంత్రికి ఆఫర్ ఇచ్చిన సాదృశ్యం వుంది. 3 లేదా 4 వేల జీతం మీద బ్రతకాల్సిన ఒక ఉద్యోగి ట్రాన్స్‌ఫర్ కోసం 3 లక్షల లంచం ఇస్తానని చెప్పగల్గు తున్నాడే మిటని ఆ మంత్రి ఆలోచించలేదు. అట్లా ఆలోచించే

నెల్లూరులో అయినా బియ్యం వుండేది ప్రజలు తినడానికే. మద్రాసుకు ఎగుమతి సక్రమంగా గాని, అక్రమంగా గాని జరిగేకొద్దీ నెల్లూరులో ధాన్యం ధర పెరిగి రైతుకే లాభం వస్తుంది. ధరల అదుపు తన చేతిలో వుందనే భ్రమతో, ప్రభుత్వమే ఉద్యోగాల విలువ, ప్రభుత్వపు ప్రతిష్ఠ, తమ స్వంత నైతిక ప్రవర్తనలను వారు పరిగణనకు తీసుకోవడం లేదు. మాంసం ముక్కలకు కుక్క ఎగబడినట్లు, కరెన్సీ నోట్ల కోసం వీరు స్మగ్లర్ల చెప్పులు తుడుస్తున్నారు. వారు పెడితే



అవినీతికి నిలయంగా వున్న సూళ్లూరుపేట సివిల్ సప్లయిస్ చెక్‌పోస్టు!

...లీసు, కమర్షియల్ ట్యాక్సెస్ అధికారులు చెక్‌పోస్టు సిబ్బంది సహకారంతో స్మగ్లింగ్ ...పిస్తున్నారనడం ఆరోపణ కాదు. స్థితికి పతనమై పోయిన అధికార యంత్రాంగం మనకిక్కడ దర్శన మిస్తుంది. తడ చెక్‌పోస్టులో కమర్షియల్

16 తేది ఆర్‌టిసి బస్‌ను గుద్ది లారీ నుంచి బహిరంగంగా, అధికారాల సమక్షంలో సరకు తరలిస్తున్న జాక్‌పాట్ లారీ

> **నిత్యం ధాన్యం మోసే లారీలు, స్మగ్లర్లు, ఎవరో అధికారులకు తెలుసు; కాని పట్టుకోరు!**

అవకాశం అతడికి కల్పించబడలేదు. చెక్‌పోస్ట్ ఉద్యోగులకు డబ్బే కాదు. రాజకీయ పలుకుబడి సైతం అపారంగా వుంది; వుండాలి. అధికారం, రాజకీయం మమేకంగా కలగలసి పోవడమే తడలో స్మగ్లింగ్ కార్యకలాపాలు అంత విచ్చల విడిగా, స్వేచ్ఛాయుతంగా జరగడానికి కారణం. నిజానికి తడ నుంచి ధాన్యం మద్రాసుకు తరలిపోతే ప్రజలకు జరిగే నష్టం ఏమీలేదు. మద్రాసులో అయినా,



16 తేదిన తడసమీపంలో జాక్‌పాట్ లారీ ఆర్టీసీ బస్సును ఢీకొన్న దృశ్యం

మద్రాసుకు బియ్యం ఎగుమతిని నిషేధించింది. ధాన్యం ధర పెరిగితే తాను సేకరించి, చౌకడిపోల ద్వారా, పంచాల్సిన బియ్యం ధర పెరిగి, ఖజానాపై భారం పడుతుందని ప్రభుత్వపు భయం. రాష్ట్రంలో పండే ధాన్యం రాష్ట్రంలోనే అమ్మడం ద్వారా ధరను నియంత్రించాలన్నది దాని సంకల్పం. ప్రభుత్వం చేసే ఇటువంటి పిచ్చి కంట్రోళ్లు, వ్యర్థ నిర్ణయాలు తింటున్నారు. తంతే తన్నించు కుంటున్నారు. సిగ్గు, అభిమానం, పరువు, ప్రతిష్ఠల న్నింటినీ ప్రక్కన పెట్టి స్మగ్లర్ల లారీలను భద్రంగా తమ చెక్‌పోస్టుల నుంచి దాటిస్తున్నారు.

ఈ స్మగ్లింగ్ కార్యకలాపాల గురించి జమీన్‌రైతు ప్రత్యేక విలేఖరి ఒక్కటంటే ఒక్క రోజు సూళ్లూరుపేట, తడలలో ఆరా తీస్తే - నూటికి 90శాతం సమాచారం లభ్యమైంది. ఎవరెవరు

> * వార్తలు వ్రాసే విలేఖర్లను పబ్లిక్‌గా బెదరిస్తున్నారు
> * పోలీసు ఎస్‌ఐకి, స్టేషన్‌లోనే, సిఐ సమక్షం లోనే దేహశుద్ధి చేశారు
> * కిరాయి గూండాలను తయారు చేసి గ్రామాలలో భీతాహం సృష్టిస్తున్నారు.

అవినీతిని పెంచి, పోషించడానికి ఉపకరించడం ఆనవాయితీ కదా! తడలో జరిగేది అదే. అయితే తమను ఏ విధి నిర్వహణకు ప్రభుత్వం అక్కడకు పంపిందో, ఆ కర్తవ్యానికి పూర్తి వ్యతిరేకంగా పనిచేసే తత్వం ఉద్యోగులకు అలవడం శోచనీయం. కనీసం ఏడాదిలో ఒక్కరోజైనా తాము పనిచేస్తున్నది ప్రభుత్వం కోసమనే స్పృహ వారిలో కల్గడం లేదు. కళ్లముందు కన్పడే కాసుల గలగలలు వారికా స్పృహను కలగనివ్వడం లేదు. సాయంత్రమయ్యే సరికి బరువెక్కి, పొర్లిపోయే జేబులను మాత్రం చూసుకుంటున్నారు కాని. ఆ బరువు క్రింద హత్యకావింపబడిన తమ ఇందులో భాగస్వాములు, ఏఏ లారీలు ఇందుకోసం వాడుతున్నారన్న వివరాలన్నీ వెల్లడైనాయి. ఒక్కరోజులో ఒక విలేకరి ఆరా తీయగల్గిన విషయం - అంతంత మంది ప్రభుత్వాధికారులకు తెలియకుండా వుంటుందా? టి బంకు ఓనరు, బస్ కండక్టర్లతో సహా చెప్తున్న స్మగ్లర్ల పేర్లు, చిరునామాలు, విజిలెన్స్ అధికారులకు తెలియవా? జనం ఫ్రీగా మాట్లాడుకునే స్మగ్లింగ్ రూట్‌లను పోలీసు తెలుసుకోలేక పోతున్నదంటే నమ్మగలమా? నమ్మడానికి మన చెవులో పూలేమీ లేవు కదా! ఈ వివరాలన్నీ సంబంధిత ప్రభుత్వ విభాగాలన్నింటికీ

కొరవ 8 పేజీలో

# 'ఎన్నికల వరకు పన్నులు కట్టవద్దు'

జూన్‌లో పెంచిన ఇళ్ల పన్నులను నిరసిస్తూ ఐక్య కార్యాచరణ కమిటీ మంగళవారం మునిసిపల్ ఆఫీసు ముందు పికెటింగ్ నిర్వహించింది. ఉదయం 9గంటలకే పలువురు ప్రజలు మునిసిపల్ గేట్ల వద్ద బైఠాయించి సిబ్బందిని ఆఫీసులోకి పోనివ్వకుండా చేశారు. మాజీ మునిసిపల్ ఛైర్మన్ శ్రీ టి. రమేష్‌రెడ్డి, ఆచార్య పి.సి.రెడ్డి, శ్రీ వి. బసవయ్య పలువురు కౌన్సిలర్లు ఈ కార్యక్రమానికి నాయకత్వం వహించారు; కొత్త కౌన్సిల్ ఏర్పడేవరకు పన్నులు చెల్లించకుండా సహాయ నిరాకరణ ఉద్యమం చేపట్టాలని కమిటీ పట్టణ ప్రజానీకానికి విజ్ఞప్తి చేసింది.

## సింహపురి

### రైతు మహాసభ

జిల్లా రైతు మహాసభ 26తేది టౌనుహాలులో జరిగింది. సోమశిల ప్రాజెక్టునుండి పెన్నాడెల్టాకు 5 మాసాల నీరు మాత్రమే ఇవ్వాలని రికార్డుల్లో వున్నప్పటికీ దానిని సవరించ కుండానే 10 మాసాలకు పైగా నీరివ్వబడు తుందని గెజిట్‌లో ప్రకటించి రైతులను పక్కదోవ పట్టించారని ఆంధ్రప్రదేశ్ రైతు సంఘ అధ్యక్షుడు శ్రీ సి. హెచ్. రాజేశ్వరరావు విమర్శించారు. గత సంవత్సరం తుఫాన్‌కు పంటలు దెబ్బతిన్న రైతులకు నష్టపరిహారం చెల్లించాలని, అపుడు దెబ్బతిన్నకట్టలకు కాల్వలకు వెంటనే మరమ్మత్తులు చేయాలని డిమాండ్ చేశారు. జిల్లాలో రైతులు ఎదుర్కొంటున్న సమస్యలపై పార్టీ ప్రమేయం లేకుండా సమైక్య పోరాటం జరపాలని సమావేశం నిర్ణయించింది. షుగర్ ఫ్యాక్టరీ ఛైర్మన్ శ్రీ సామంతు సుబ్బారెడ్డి, శ్రీ జక్కా రంగారెడ్డి శ్రీ గునుపాటి రామచంద్రయ్య, శ్రీ జి.వి. పద్మనాభయ్య, శ్రీ గండవరం సేతురామరెడ్డి శ్రీ కె. చంద్రమోహన్ రెడ్డి ఈ కార్యక్రమంలో పాల్గొని ప్రసంగించారు.

### అక్కినేని జన్మదినోత్సవ వేడుకలు

ప్రముఖ సినీ నటుడు పద్మభూషణ్ శ్రీ అక్కినేని నాగేశ్వరరావు 69వ జన్మదినోత్సవ వేడుకలు 20తేది ఇందిరాభవన్‌లో ఘనంగా జరిగాయి. సభను అధ్యక్షించిన మాజీ ఎమ్మెల్యే శ్రీ కె.వి.సుబ్బారెడ్డి అక్కినేని నటనా జీవితం గూర్చి ప్రసంగించారు. సేవా జ్యోతి అధ్యక్షులు శ్రీ జె.ఎల్.నారాయణ కార్యక్రమాన్ని ప్రారంభించారు. ఈ సందర్భంగా జరిగిన నృత్యపోటీల్లో పి.సరోజ, కె.సురేష్, జి. సుబ్రమణ్యం,

కొరవ 11 పేజీలో

# రాపూరు అటవీ సంపద దళారుల పాలౌతూంది!

రాపూరు పరిసర ప్రాంతాల్లోని అడవుల నుండి లభ్యమయ్యే అపూరూప సంపదను కొందరు దలారులు అక్రమంగా తరలించుక పోతున్నా అడిగే నాథుడే కరువయ్యారు. ఇక్కడి అడవుల్లో లభించే సంపదను పెంపొందించి గిరిజన అభ్యున్నతికి బాటలు వేయాల్సిన సహకార సంస్థ ఉదాసీన వైఖరే దలారుల పాలిట వరమయ్యింది. ముఖ్య ఆదాయాన్ని తెచ్చే ఫలసాయాన్ని అభివృద్ధి చేయడం మాని బంక, తేనె వంటి సాధారణ వస్తువులను మాత్రమే సంస్థ సేకరిస్తుంది. సంస్థ, అటవీ శాఖాధికార్లు, దలారుల మధ్య ఒప్పందాల వల్ల సుగంధవేర్లు, నేలతంగేడు, భూచక్రగడ్డి, నారముష్టిగింజ, తుమ్మచెక్క వంటి వస్తువులను దలారులు స్వంతం చేసుకుంటున్నారు. పట్టపగలే బస్సులపై వేసుకొని వేరే ప్రాంతాలకు సాగి పోతున్నారు. అడిగేవారు లేకపోవటంతో దలారులు ఆడిందే ఆట, పాడిందే పాటగా ఉంది. అటవీ ఫలసాయం సేకరణలో గిరిజన సహకార సంస్థ విఫలమయ్యిందని చెప్పవచ్చు. చాలినంత సిబ్బంది లేక పోవడం, ఉన్నవారు ఎక్కడెక్కడో కాపురాలు ఉండడం అభివృద్ధికి అడ్డంకిగా ఉంది. గిరిజనులు సేకరించిన ఫలసాయానికి అప్పటికప్పుడు ఆర్థిక సహాయం అందించను ఎవరూ ఉండరు. ఈ చర్య కూడా దలారుల పాలిట వరమై ఉంది. ఉన్నతాధికార్లు ఈ విషయాలు సరిదిద్దకపోతే రాపూరు అడవులు దలార్లలకు ధారాదత్తంకాక తప్పదు.

## జిల్లా వార్తలు

### నెల్‌కాస్ట్ వైద్యశిబిరం

గూడూరు ఇండస్ట్రియల్ ఎస్టేట్‌లోని కార్మికులకు నెల్‌కాస్ట్ స్టాఫ్ వెల్ఫేర్ అసోసియేషన్, రోటరీ క్లబ్ సంయుక్తంగా 20తేది ఉచిత వైద్య శిబిరాన్ని నిర్వహించాయి. 250మంది కార్మికులకు శిబిరంలో కంటి, దంత, ఆరోగ్య పరీక్షలు చేశారు. డాక్టర్. సి.జనార్ధనరెడ్డి, డాక్టర్ జె.ప్రకాష్, డాక్టర్ గంగాధర రెడ్డి, నెల్‌కాస్ట్ ఫైనాన్స్ డైరెక్టర్ శ్రీపి. విజయభాస్కరరెడ్డి, స్టాఫ్ అసోసియేషన్ అధ్యక్షుడు శ్రీ టి రామచంద్రన్, రోటరీ క్లబ్ అధ్యక్షుడు శ్రీ ఎం శ్రీరామమూర్తి ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

పొడుగు ఎసి ముందు. వివేకానంద రెడ్డి ఎంత పొట్టివారో చూడండి; వర్ధంతి సందర్భంగా 20తేది విగ్రహానికి తగిన సైజు మాల వేస్తున్న దృశ్యం.

### వైభవంగా పోలేరమ్మ జాతర

ఈ నెల 16,17తేదుల్లో వెంకటగిరి పోలేరమ్మ జాతర దేవాదాయ శాఖ ఆధ్వర్యంలో వేలాది మంది ప్రజల సమక్షంలో వైభవంగా జరిగింది. 16తేది సాయంత్రం ముఖ్యమంత్రి సతీమణి, శ్రీమతి రాజ్యలక్ష్మమ్మ పోలేరమ్మకు పట్టుచీర తెచ్చి పెట్టి జాతరకు శ్రీకారం చుట్టారు. 16 వ తేదీ రాత్రి రంగు రంగుల విద్యుద్దీపాలతో అలంకరించిన పోలేరమ్మను గుడివద్దకు చేర్చారు. 17తేది వేలాది మంది భక్తుల సమక్షంలో దాదాపు మూడు గంటల ఊరేగింపు అనంతరం అమ్మవారి నిమజ్జన కార్యక్రమం జరిగింది. రాష్ట్ర వాణిజ్య పన్నుల శాఖా మంత్రి శ్రీ కనుమూరి బాపిరాజు, కేంద్ర ఎరువుల రసాయనాల శాఖా సహాయ మంత్రి శ్రీ చింతామోహన్ పోలేరమ్మ ను సందర్శించి పూజలు చేశారు. జంతుబలి యధా తథంగా జరిగింది. సారామత్తులో జనం జోగారు.

రాజా ఆధ్వర్యంనుంచి ప్రభుత్వం తీసుకొన్న తరువాత తొలిసారి వచ్చిన జాతర కాబట్టి జిల్లా అభివృద్ధి అధికారి శ్రీ సతీష్‌చంద్ర, దేవాదాయ శాఖ జాయింట్ కమీషనర్ శ్రీ శంకరరెడ్డి దగ్గరుండి ఏర్పాట్లు పర్యవేక్షించారు.

### గూడూరు షిర్డి సాయి సామూహిక వివాహాలు

గూడూరులోని షిర్డిసాయి కల్చరల్ అసోసియేషన్ విజయదశమి పర్వదినాన్ని పురస్కరించుకొని సాయి

కొరవ 10 పేజిలో

## పినాకిని తీరం

### దురదృష్టకరం!

ఇరవై మాసాలు కాలేదు. ఆనందంలో పుప్పొంగినహృదయం ఇంతలోనే నిరుత్సాహంలో నిర్వేదంలో నిర్వేరపాటులో నిండి పోతుందని వూహించలేదు. పీడకల మధురస్వప్నాన్ని మధ్యలో భంగపరుస్తుందని అనుకోలేదు. రాజకీయ వ్యతిరేక పరిణామం ఎప్పుడూ ఆకస్మాత్తుగా ఆకాశం నుండి విరుచుకపడే పిడుగువలె వుంటుందని తెలుసు. గతంలో ఎందరో, ఎందరెందరో అర్థాంతరంగా నిర్బంధ అధికార విరమణకు గురియైన సంఘటనలు ఎన్నో ప్రత్యక్షంగా చూచాము. సంతోషంగా ఢిల్లీకి విమానం ఎక్కడం, మాడ్చుమొహంతో బేగం పేటలో దిగడం కాంగ్రెస్ సంస్కృతి విశిష్టతగా వుంటున్నదే. అయినా పదేళ్ళ అహోరాత్రుల నిర్విరామ ప్రయత్నంతో, అవిశ్రాంతమైన రాజకీయ కార్యకలాపంతో, మూడు ఆశాభంగాల అవమానాల అనంతరం గమ్యంచేరుకొని ముఖ్యమంత్రి పీఠం అధిష్టించ గల్గిన జనార్ధనరెడ్డి ఈ విధంగా దిగిపోవలసి వస్తుందని తెలిసినప్పుడు మనసు విప్పుక్కుమంది.

ప్రతిపక్షాలు గగ్గోలు పెట్టినా ఆయన్నేమీ చేయలేకపోయాయి. హిమాయత్ నగర్ ఎన్నిక ఫలితం కడప పార్లమెంటు ఎన్నిక వాయిదా సంక్షోభం. రాజశేఖర రెడ్డి - హనుమంతరావు - ద్రోణం రాజాల అసమ్మతి పూదర - పది మంది మంత్రుల రాజీనామా బెదిరింపు, డాక్టర్ చెన్నారెడ్డి ద్వజం... ఈ వ్యతిరేకాధ్యాయం రోజారోజుకు పెరుగుతున్నా ఆయనను కదలించలేకపోయాయి. కిలో రెండు రూపాయల బియ్యం రద్దు, విద్యుచ్ఛక్తి చార్జీల పెంపు వంటి వివాదపరమైన చర్యలూ ఆయన పదవిని బంపిన పరచలేక పోయాయి. నక్సలైట్ల మీద నిషేధం, వారితో ప్రత్యక్ష పోరాటపు సాహసోపేతమైన చర్య జనార్ధనరెడ్డి కే సాధ్యమని పించాయి. ఇరవై

కొరవ 10 పేజిలో









కొరవ 10 పేజిలో

# నెల్లూరు నలుచెరగుల్లో
## విమర్శకుడు

### కలెక్టర్ బదలీ

కలెక్టర్ శ్రీ కె. రాజా రాష్ట్ర గ్రామీణ గృహ నిర్మాణ సంస్థ మేనేజింగ్ డైరెక్టర్‌గా బదలీ అయ్యారు. జాయింట్ కలెక్టర్ శ్రీ ఆర్. సాంబశివరావును ప్రమోషన్‌పై అక్కడే కలెక్టర్‌గా నియమించారు. డిఆర్‌ఓ శ్రీ సతీష్ చంద్రను ప్రమోషన్‌పై జాయింట్ కలెక్టర్‌గా నియమించారు. కుందమార్పిళ్లు జరిగినట్లు జరిగిపోయాయి ఈ బదలీలు.

రాజా గారి బదలీ చాలా కాలం నుంచి అనుకుంటున్నదే. ఆయన నెల్లూరుకు వచ్చి 4 సంవత్సరాలు దాటింది. ఆరు నెలల నుంచి అప్పుడప్పుడు ఆ ప్రస్తావన వస్తూండేది. ముఖ్యమంత్రి జనార్దన రెడ్డి నిలుపుతూ వచ్చారు.

జిల్లా కలెక్టర్ల చరిత్రలో శ్రీ రాజా పేరు శాశ్వతంగా నిల్చిపోతుంది. చరిత్ర సృష్టించిన అధికారి ఆయన. నాలుగేళ్లకు పై బడి ఒకే స్థానంలో వున్నా వివాదరహితుడుగా వుండగల్గడం ఒక విశేషమైతే, జిల్లాలోని పేద ప్రజానీకపు జీవితాలలో ఒక సామాజిక విప్లవం తెచ్చిన అసాధారణ ప్రతిభా సమన్వితుడుగా గౌరవాదరాలు పొందగల్గిన వారు శ్రీ రాజా. అక్షరాస్యతా కార్యక్రమాన్ని ఒక ఉద్యమంగా మార్చుకొని, సంధరది వేయకుండా, బడుగు వర్గాల బ్రతుకులలో ఊహించ రానంత చైతన్యం తెచ్చారు. సారాయి వ్యతిరేక ఉద్యమానికి సృష్టికర్త రాజా గారే! జిల్లాలో బలహీన వర్గాల ప్రజలు ఆయనలో ఒక ఆత్మబంధువును చూసుకొనే వారు.

సాంబశివరావు గారు వ్యక్తిగా ఎంత స్నేహపాత్రుడో, అధికారిగా అంత నిక్కచ్చి మనిషి. ఒకటిన్నర సంవత్సరం పైన జిల్లాలో, జిల్లా పరిస్థితులతో ప్రగాఢ సంబంధాలు నెలకొల్పు కున్నవాడు కాబట్టి, ఆయన పరిపాలన జనరంజకంగా వుండగలదనే ఆశిద్దాం.

### ఒకేసారి ముగ్గురికి కార్పొరేషన్ పదవులు

జనార్దనరెడ్డి గారు, జిల్లాకు సంబంధించి ఒకే రోజు ముగ్గురికి కార్పొరేషన్ పదవులు పంచి పెట్టారు. సూళ్లూరుపేట ఎమ్మెల్యే శ్రీ పసల పెంచలయ్యను రాష్ట్ర పాడి పరిశ్రమ సమాఖ్య అధ్యక్షుడిగా, గూడూరు ఎమ్మెల్యే శ్రీ పత్రా ప్రకాశ రావును రాష్ట్ర గ్రామీణ గృహ నిర్మాణ సంస్థ ఛైర్మన్‌గా, జిల్లా రాజకీయాలలో చాలా సంవత్సరాల నుంచి తెరవెనుక సంబంధాలు నెరపే కావలియుడు, ప్రస్తుతం జానకిరాం విధేయుడు శ్రీ పూసల రంగయ్యను రాష్ట్ర టెక్స్‌టైల్స్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఛైర్మన్‌గా నియమించారు.

పెంచలయ్యకు మంత్రి పదవిపై మోజు వుండింది. ఆ కోరికతోనే కార్పొరేషన్ ఛైర్మన్ గిరులను ఎన్నిసార్లు ఇవ్వజూపినా నిరాకరిస్తూ వచ్చారు. ఇక అవకాశం లేదు కాబట్టి, అంగీకరించి నట్లున్నారు. పత్రా ప్రకాశరావు ఒక రాజకీయ వేదాంతి; పదవి ఇచ్చినా వద్దనడు, ఇవ్వకుంటే బాధపడడు. ఏ పదవిలో వున్నా ఆవాహన, విసర్జన వుంటవు. వెంగళరావు నుంచి, శివశంకర్ వరకు పెద్ద నేతలందరికీ సన్నిహితుడుగా గుర్తింపు పొందినా రంగయ్యను ఎప్పుడూ ఏ పదవీ వరించలేదు. ఇన్నాళ్లకు జనార్దనరెడ్డి ఆ ఉబలాటం తీర్చారు.

### కొత్త డిఎస్‌పి

నెల్లూరు డిఎస్‌పిగా శ్రీ లక్ష్మణరెడ్డి నియమితులైనారు. మురళి బదలీ తర్వాత రెండు నెలలపైనుంచి ఖాళీగా వుండిన పోస్టు ఇది.

లక్ష్మణరెడ్డి తెలంగాణా ప్రాంతీయుడు. కావలిలో కొద్దికాలం పనిచేశారు. ఎట్లా పనిచేయబోతాడో, చూసి చెప్పాం?

### విద్యుత్ సమ్మె

రాష్ట్ర విద్యుత్ ఉద్యోగుల సంఘం అక్టోబరు 9తేది నుంచి సమ్మె చేయబోతున్నట్లు నోటీసు ఇచ్చింది. కరెంటు కోత లేకుండా ప్రజలు సుఖపడిపోతున్నారని కాబోలు - ఈసమ్మె.

### విధివిలాస మనదగిన విచిత్ర ప్రమాదం

తలరాత మార్చలేరనే లోకోక్తి నిజమే నన్పిస్తుంది - 24 తేది రాత్రి అయ్యప్ప దేవాలయం సమీపంలో జరిగిన ప్రమాదం వంటివి చూస్తే!

ట్రంకురోడ్డుకు తూర్పుగా, వందఅడుగుల దూరంలో, హోటల్ సరోజ అనే చిన్న హోటల్ వుంది. దాని యజమాని పి. శంకరయ్య ఇల్లు కూడా అదే. 24 తేది రాత్రి హోటల్ మూసి, భార్యా బిడ్డలతో ఆ ఇంటి ముందు గదిలో నిద్రపోతుండినాడట. 2 గంటల సమయంలో ఒక టిప్పరు, (టిఎస్‌హెచ్ 796) ఎదురుగా వస్తున్న లారీని గ్రుద్దుకొని, అదుపు తప్పి, నేరుగా హోటల్ ముందు భాగాన్ని ఢీకొన్నది. ఆ అదటుకు పట్టెరు వూడిపోయి ఇంటి పై కప్పు రేకులు విరిగి, లోపలున్న వారిపై పడ్డాయి. కవిత అనే 12 సంవత్సరాల పాప అక్కడికక్కడే మరణించింది. శంకరయ్యకు, ఆయన మరొక కుమార్తెకు తీవ్రగాయాలు.

విధివిలాసం కాకుంటే, ఎక్కడో రోడ్డుకు దూరంగా, తమ ఇంట్లో నిద్రపోతుండిన వారిని మృత్యువు ఈ రూపంలో కబళించడమేమిటి?

### 'ఛాయిస్' ప్రారంభం

నెల్లూరులో తొలి రొయ్యల ప్రాసెసింగ్ కర్మాగారం 'ఛాయిస్' ప్రారంభోత్సవం రేపు (26 తేది) సాయంత్రం జరుగనున్నది. కపర్తి కృష్ణారెడ్డి కుమారుడు, నెల్లూరులో దాస్‌ప్రకాశ్ ఐస్‌క్రీమ్ ప్రవేశపెట్టిన యువకుడు, శ్రీ మీరారెడ్డి దీనికి ప్రేరకుడు. సిరళకు చెందిన ఛాయిస్ అనే ఒక పెద్ద పారిశ్రామిక సంస్థ దీన్ని లీజు పద్ధతిపై నడపబోతున్నది. దాస్ ప్రకాశ్ ఐస్‌క్రీమ్ ఫ్యాక్టరియే ప్రాసెసింగ్ కర్మాగారంగా రూపుది ద్దుకుంటున్నది. రొయ్యలను శుభ్రం చేసి, విడివిడిగా ఒక్కొక్క రొయ్యను ప్లాస్టిక్ పొట్లంలో ప్యాక్ చేసి, ఫ్రీజ్ చేసి, ఎగుమతి చేయడం దీని కార్యక్రమం. చాలా అధునాతన సాంకేతిక పరిజ్ఞానంతో నెలకొల్పుతున్నారు. జిల్లాలో విస్తారంగా పెరుగుతున్న రొయ్యల పెంపకం పరిశ్రమకు ఉపకరించే ఫ్యాక్టరీ ఇది. రైతులకు నిజాయితీగా సేవచేసి, వ్యాపారాభివృద్ధి సాధించాలని ఆకాంక్షిస్తున్నాము.

### మరణం

'మోడరన్‌స్టోర్స్' ద్వారా నెల్లూరు వర్గ వ్యాపారంలో మకుటం లేని చక్రవర్తిగా గుర్తింపు పొందిన శ్రీరంగశెట్టి వెంకట చలపతి గుప్త 21తేది ఉదయం హఠాత్తుగా మరణించారు. ఆయనకు భార్య, నలుగురు కుమారులున్నారు. వారి కుటుంబానికి సానుభూతి.

---

### నిష్ఫలం

మొదటి పేజీ తరువాయి

రాజకీయంగా ఆయనకు కొండంత బలం వుండింది. దిగిపోక తప్పదని తెలిసీ, 130 మంది ఎమ్మెల్యేలు బహిరంగంగా మద్దతు ప్రకటించారు. సాధారణ విషయం కాదిది. పదవి పోతుందన్న పొలిడి అందితే, తుపాకి దెబ్బకు పిట్టల్లా జనం కళ్లముందు నుంచి ఎగిరి పోయే ఈ రోజులలో అంతటి అభిమానాన్ని! సంపాదించుకోవడం జనార్దనరెడ్డికే చెల్లింది. కాని ఏమి ప్రయోజనం? ప్రధాని శ్రీపివి పాశుపతాస్త్రం సంధించాడు. ఎక్కడ అవకాశం దొరుకుతుందోనని ఎప్పటి నుంచి కాచుకొని వుండినాడో మహానుభావుడు, వదలి పెట్టలేదు. హైకోర్టు తీర్పు వెలువడిందని తెలియగానే రాజీనామా పెట్టమని హుకుం జారీ చేశాడు. పదవిలోవున్న వారిపైన కోర్టు వ్యాఖ్యలు చేసినప్పుడు తప్పుకోవడం ఉత్తమ ప్రజాస్వామ్య ధర్మమైనా -ఇప్పుడెవరు పాటిస్తున్నారు దానిని? కేంద్రమంత్రివర్గ సభ్యులైన శరద్‌పవార్, అర్జునసింగ్, జాఫర్‌షరీఫ్‌లపై ఇటీవల కోర్టులు తీవ్ర వ్యాఖ్యలు చేశాయి. రైల్వే మంత్రినైతే, కోర్టు అభిశంసించింది. వారి నెవరినీ కదిలించే ధైర్యం పివికి కల్గలేదు. ఆ తీర్పులతో పోలిస్తే జనార్దనరెడ్డిపై చేసిన వ్యాఖ్య అంత సీరియస్‌దేమీ కాదు. స్ట్రిక్చర్స్ జారీ చేయలేదు. కాలేజీల జీఓ కొట్టివేస్తూ, 'జనప్రియ' ఫైల్‌పై ముఖ్యమంత్రి స్వయంగా సంతకం చేయకుండా, ఇతర మంత్రులకే పంపివుంటే బాగుండేదని మాత్రం వ్యాఖ్యానించింది! ఏడు ఆరోపణలు ధృవీకరించి, నిందితుడని హైకోర్టు పేర్కొన్నా హఠం వేసుకొని కుర్చీపై కూర్చున్న ఎన్‌టిఆర్ సైతం దూన భోంతరాలు దద్దరిల్లేటట్లు ఆగం చేశాడు; అసమ్మతి నాయకుల రచ్చ సరేసరి! కోర్టుతీర్పులో అభ్యంతర కరమైనదేదీ లేదని ఎంత వాదించినా, ఎమ్మెల్యేలందరు ఇది అన్యాయమని ఆక్రోశించినా, పివి వెన్నెంచుకోలేదు. మూడవనాడను ఆఘమేఘాలమీద హైదరాబాదుకు పంపి, రాజీనామాకు ఒప్పించారు.

రాజీనామా చేయించడానికి కూడా చాలా తొందర పడ్డారు - ఢిల్లీ పెద్దలు. రాజ్యాంగ సాంప్రదాయాలకు విరుద్ధంగా, అసెంబ్లీలో ద్రవ్య వినియోగపు బిల్లును గిలెటిన్ చేసి, సమావేశాలు ముగించి, ఇంటికి సాగనంపడానికి చూశారు. కాని జనార్దన రెడ్డి ఒప్పుకోలేదు.

ఇదంతా ఆత్మ సంతృప్తి కోసం పడే ఆరాటమే - తప్ప, జనార్దనరెడ్డి రాజకీయ జీవితంపై పడిన మచ్చను రూపుమాపేది కాదు. తన పతనం కోసం ప్రత్యర్థులు కాచుకొని వున్నారని తెలిసీ, తన కాళ్లు పట్టి క్రిందకు లాగడానికి పొంచి వున్నారని తెలిసీ, వారికి అవకాశం కల్పించారు. పలు విధానపరమైన నిర్ణయాల ద్వారా సమర్థుడైన ముఖ్యమంత్రి అన్పించుకునే దశలో, అత్యంత అవమానకర పరిస్థితులు తనకు తానే కల్పించుకొని రంగం నుంచి నిష్క్రమిస్తున్నారు.

జనార్దన రెడ్డి తర్వాత ఎవరు? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పగలిగిన వాడు ఒక్క పివినే! కాని ఆయన నోరు తెరచి మాట్లాడడం లేదు. కాటికి కాళ్లు చాపివున్న చెన్నారెడ్డి నుంచి, కలలో సైతం ఆ పదవినాశించే అర్హత లేని చిత్తరంజన్ దాస్ వరకు ఎందరో ఆరాట పడుతున్నారు. విజయభాస్కర రెడ్డి మేకపోతు గాంభీర్యంతో నాకు వద్దనే వద్దంటున్నారు. డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డికి ఈ సారి ఛాన్సు తనదేనన్న ధీమా వుంది. రెడ్డి, కమ్మలను ప్రక్కన పెట్టి ఇతరులకు అవకాశం ఇచ్చే ఆలోచన చేస్తారన్న వాదంలో రోశయ్య, శ్రీపాదరావు పేర్లు విన్పడుతున్నాయి. నాదెండ్ల ఇంకొక ప్రక్క తల్లక్రిందుల తపస్సు చేస్తున్నారు. సమర సింహారెడ్డికూడా ఆశ పడుతున్నారు.

అసలు ఎమ్మెల్యేలకు ఛాన్సు వుంటుందా? ఇది వరకటి వలె నిషేధం విధిస్తారా? నిర్ణయం సిఎల్‌పిలో మెజారిటీకి వదలి పెడతారా? సీల్డు కవరులో పేరు పంపుతారా? పి.వి. 28 తేది ప్యారిస్‌కు వెళ్లే ముందే నిర్ణయం జరుగుతుందా? 30 తేది తిరిగి వచ్చిన తర్వాత చూడబోతారా? కొత్త నాయకుడి ఎంపికలో పాత నాయకుడి మాటకు విలువ వుంటుందా? ఇవన్నీ ప్రశ్నలే. సమాధానం తెలియని సందేహాలే. 28 తేది సాయంత్రం జనార్దన రెడ్డి రాజీనామా ఆమోదం పొందేవరకు ఏ సంగతి తెలియదు. ఊహాగానాలు మాత్రం జోరుగా జరుగుతున్నాయి.



శ్లో॥ అంబా శాశ్వతి ఆగమాది వినుతా ఆర్యా మహాదేవతా
యా బ్రహ్మాది పిపీలికాంత జననీ యా వై జగన్మోహినీ
యా పంచ ప్రణవాది రేఫ జననీ యా చిత్కళా మాలినీ
చిద్రూపి పరదేవతా భగవతీ శ్రీ రాజరాజేశ్వరీ.

# శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారి దేవస్థానము

దర్గామిట్ట – నెల్లూరు - 4. ఫోన్ నెం. 22016

# నవరాత్రి బ్రహ్మోత్సవ ఆహ్వాన పత్రిక

## 27-9-92 తేది నుండి 6-10-02 తేది వరకు

అయ్యా!

సింహపురి దర్గామిట్టలో వేంచేసియుండు శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారి దేవస్థానము నందు నవరాత్రి బ్రహ్మోత్సవములు శ్రీ అంగీరనామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ ప్రతిపద 27.9.92 తేది ఆదివారం మొదలు 6.10.92 తేది మంగళవారం వరకు జరుగును. ప్రతిదినము ఉదయం 8.00 గంటల నుండి 12.00 గంటల వరకు విశేష నవావరణ, అష్టోత్తర, సహస్రనామ పూజలు జరుగును. కావున భక్తులు, ఉభయకర్తలెల్లరు పాల్గొని కార్యక్రమములు జయప్రదము చేసి శ్రీ రాజరాజేశ్వరి అమ్మవారి కరుణాకటాక్షములకు పాత్రులగుదురని ప్రార్థించుచున్నాము.

### ఉత్సవ కార్యక్రమములు

| తేది | వారము | తిథి | అలంకారము | ఉభయకర్తలు |
|---|---|---|---|---|
| 27.9.92 | ఆదివారము | పాడ్యమి | "కలశస్థాపన"<br>ఉదయం 8.56 గంటలకు తులాలగ్నమున<br>చండీ అలంకారము | శ్రీ ఆర్. వెంకటేశ్వరరావు<br>పోస్టల్ కాలనీ, నెల్లూరు - 4. |
| 28.9.92 | సోమవారము | విదియ | భవాని అలంకారము | శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డి గారు ఎం.పి.,<br>శ్రీ మాగుంట సుధాకర్‌రెడ్డి గారు<br>శ్రీ మాగుంట శ్రీనివాసులురెడ్డి గారు, నెల్లూరు |
| 29.9.92 | మంగళవారము | తదియ | గాయత్రి అలంకారము | శ్రీ ఆనవల్లి అశోక్ కుమార్‌రెడ్డి గారు, కోవూరు |
| 30.9.92 | బుధవారము | చతుర్థి | అన్నపూర్ణ అలంకారము | శ్రీమతి దేవిరెడ్డి శైలజమ్మ గారు, మద్రాసు |
| 1.10.92 | గురువారము | పంచమి | గజలక్ష్మి అలంకారము | శ్రీ పి. ఓబుల్‌రెడ్డి గారు<br>మేనేజింగ్ డైరక్టర్, ఇండోనేషనల్ లిమిటెడ్, (నిప్పో), నెల్లూరు -4. |
| 2.10.92 | శుక్రవారము | షష్ఠి | కాళికాదేవి అలంకారము | శ్రీ చెన్నారెడ్డి నదీప్ కుమార్‌రెడ్డి గారు, ఇండికేర్ మెడికల్స్ – నెల్లూరు |
| 3.10.92 | శనివారము | సప్తమి | సరస్వతి అలంకారము | శ్రీ బి. మధుసూదనరెడ్డి గారు,<br>శ్రీమతి బి. రజని గారు, అమెరికా |
| 4.10.92 | ఆదివారము | అష్టమి | దుర్గా అలంకారము | శ్రీ ఆర్. వెంకట్రామయ్యనాయుడు గారు, నెల్లూరు |
| 5.10.92 | సోమవారము | నవమి | మహిషాసురమర్దిని సువాసిని పూజ | శ్రీమతి ఆనం అమ్మజమ్మ గారు, నెల్లూరు |
| 6.10.92 | మంగళవారము | దశమి | శ్రీ రాజరాజేశ్వరి అలంకారము శ... పూజ పారువేట, గ్రామోత్సవము | శ్రీ ఆక్కా కోదండరామిరెడ్డి గారు ఎం.ఎల్.ఎ, నెల్లూరు |

## - 7-10-92 తేది బుధవారం మధ్యాహ్నం 12 గంటలకు దేవస్థానం వారిచే "అన్నదానము"-

### ప్రత్యేక కార్యక్రమములు

| తేది | వారము | సమయం | కార్యక్రమం | ఆర్థిక సహాయము అందజేసిన వారు |
|---|---|---|---|---|
| 27.9.92 | ఆదివారము | రాత్రి 7 గంటల నుండి | గానకోకిల, రేడియో కథకురాలు శ్రీమతి మామిడి సరస్వతి భాగవతారిణి (తెనాలి) గారిచే "హరికథ" కాలక్షేపము. | శ్రీ ఆర్. వెంకటేశ్వరరావు గారు, పోస్టల్ కాలనీ, నెల్లూరు - 4 |
| 28.9.92 | సోమవారము | రాత్రి 7 గంటల నుండి | సినీ గాయకుడు శ్రీ వి. రామకృష్ణ & పార్టీ (మద్రాసు) వారిచే "పాటకచేరి" | శ్రీ మాగుంట సుబ్బరామిరెడ్డిగారు, ఎం.పి.,<br>శ్రీ మాగుంట సుధాకర్‌రెడ్డి గారు<br>శ్రీ మాగుంట శ్రీనివాసులురెడ్డి గారు |
| 29.9.92 | మంగళవారం | రాత్రి 7 గంటల నుండి | ప్రఖ్యాత భరతనాట్య కళామణి కుమారి శ్రీలత విశ్వనాథన్ & పార్టీ (మద్రాసు) వారిచే "భరతనాట్య ప్రదర్శన". | శ్రీ ఆనవల్లి అశోక్‌కుమార్‌రెడ్డి గారు, కోవూరు |
| 30.9.92 | బుధవారం | రాత్రి 7 గంటల నుండి | హాస్యకథా చక్రవర్తులు - టి.వి. రేడియో ఆర్టిస్ట్ శ్రీ వేములవాడ విస్సికృష్ణదళం (తెనాలి) వారిచే "బుర్రకథ". | దేవస్థానము |
| 1.10.92 | గురువారం | రాత్రి 7 గంటల నుండి | కూచిపూడి ఆర్ట్ అకాడమి డైరక్టర్ శ్రీ వెంపటి చినసత్యం శిష్యురాండ్రు కుమారి శశికళ, కుమారి శోభ & పార్టీ (మద్రాసు) వారిచే "కూచిపూడి నృత్య ప్రదర్శనలు" | శ్రీ పి. ఓబుల్‌రెడ్డి గారు,<br>మేనేజింగ్ డైరక్టర్, ఇండోనేషనల్ లిమిటెడ్ (నిప్పో) నెల్లూరు -4. |
| 2.10.92 | శుక్రవారం | రాత్రి 7 గంటల నుండి | గిన్నిస్ బుక్ రికార్డ్ అయిన ధ్వన్యనుకరణ సామ్రాట్ శ్రీనివాస్ (హైదరాబాద్) వారిచే "మిమిక్రి". | శ్రీ చెన్నారెడ్డి నదీప్ కుమార్‌రెడ్డి గారు, ఇండికేర్ మెడికల్స్, నెల్లూరు. |
| 3.10.92 | శనివారం | రాత్రి 7 గంటల నుండి | మధురగాయక అల్లా కృష్ణమూర్తి & పార్టీ (నెల్లూరు) వారిచే "సంగీత కచేరి" | దేవస్థానము |
| | | రాత్రి 9 గంటల నుండి | మరియు శ్రీ రామప్రసాద్ కళానిలయం (నెల్లూరు) వారిచే "శ్రీ వెంకటేశ్వర మహాత్యం" పౌరాణిక నాటక ప్రదర్శన. | |
| 4.10.92 | ఆదివారం | రాత్రి 7 గంటల నుండి | గిన్నిస్ బుక్ రికార్డ్ అయిన అపూర్వ ఇంద్రజాలకుడు శ్రీ క్రాంతికార్ (హైదరాబాద్) వారిచే "ఇంద్రజాలం" (మ్యాజిక్‌షో) మరియు మాట్లాడే బొమ్మ ప్రదర్శనలు. | శ్రీ ఆర్. వెంకట్రామయ్య నాయుడు గారు, నెల్లూరు. |
| 5.10.92 | సోమవారం | రాత్రి 7 గంటల నుండి | కిన్నెర (కోవూరు) వారు సమర్పించు "మోహిని భస్మాసుర" నృత్యనాటకం | దేవస్థానము |
| 6.10.92 | మంగళవారం | రాత్రి 7 గంటల నుండి | శ్రీ రాజరాజేశ్వరి కళానికేతన్ (నెల్లూరు) వారిచే "భగవద్గీత" నృత్యనాటిక కుమారి వై. సుచిత్ర, కుమారి వి. భవాని మాస్టర్ సుధీర్ గార్లచే ప్రదర్శింపబడును. | శ్రీ ఆక్కా కోదండరామిరెడ్డి గారు, ఎం.ఎల్.ఏ, నెల్లూరు |

గమనిక : గ్రామోత్సవమునందు తెనాలి బ్యాండ్ కచేరి మరియు శ్రీ యస్. వేలుమురుగన్ & పార్టీ రాయవేలూరు (తమిళనాడు) వారిచే "నయాండి మేళం - గరగాటలు".

శ్రీ కోడూరు వెంకటరాఘవరెడ్డి, ఛైర్మన్, శ్రీ పసుపులేటి మాధవయ్య, శ్రీ బాలారథ్ నరేంద్రప్రసాద్,
శ్రీమతి ఉగ్గుమూడి వసుందరమ్మ, శ్రీమతి ఏటుకూరు భాగ్యలక్ష్మి, ట్రస్టుబోర్డు సభ్యులు

# వేలం ప్రకటన

## గుడివాడ సబ్‌కోర్టులో

విజయవాడ సబ్ కోర్టు

OS 449/79 EP 30/92

Between:

ఆంధ్రాబ్యాంకు గవర్నరు పేట, Rep by its BM, విజయవాడ -DHr

వెల్లింకి విజయ వెంకటరావు -JDr

1వJDr.

ఈ దిగువ షెడ్యూలు దాఖలా ఆస్థి పై కోర్టు వారి ఎదుట 12.10.92 తేది ఉదయం 10.30 గంటలకు వేలం వేయుదురు. కావున కావలసిన వారు పాడుకొనవచ్చును.

### షెడ్యూలు

కృష్ణాడిస్ట్రిక్ట్ కంకిపాడు సబ్‌రిజిష్ట్రారు వారి యిలాకా మానికొండ గ్రామము 1వ JDr స్వాధీన హక్కు భుక్తములో యుండి ఈ దావా బాకీ క్రింద హామీగా యున్నాస్తి వివరం.

1. R.S.No. 589/1AC 0.75 సెంట్లు Hc 0.304 East: G.సీతారామయ్య గారి భూమి; South: M. వెంచు పున్నయ్య; West: Land in 3rd ఐయిటము; North: Land of V. విజయ వెంకటరావు. ఈ హద్దుల మధ్య య0.75 సెంట్లు.

2. S.No. 589/4 Ac. 0.54 Units 0.27 సెంట్లు East: యిరిగేషన్ కాలువ; South: యిరిగేషన్ చానల్, ఈ నెంబరులో; West: Land of 3rd Item; North: Land of M. వెంచు పున్నయ్య. ఈ హద్దుల మధ్య Ac. 0.27 సెంట్లు

Item No. 3

R.S.No. 588/2 Ac 1.73 సెంట్లు Out off 2.44 సెంట్లులలో

East: Land in Item (1) and (2) to some extent and the land of M. వెంచు పున్నయ్య to some extent.

South: యిరిగేషన్ చానల్ ఈ నెంబరులో West Land of G. రాజ్యలక్ష్మీశ్వరమ్మ గారి ఈ నంబరులో భూమి.

North: Land of V. విజయ వెంకట రావు to some extent and land of G. రాజ్యలక్ష్మమ్మ.

Item No. 4

R.S. No. 588/2 Ac 0.50 సెంట్లు out off 2.44 సెంట్లు

East: Land of given to N. రత్నమ్మ; South: Land of వెంచు పున్నయ్య; West: యిరిగేషన్ చానల్; North: Do, Do, రెండు హద్దుల మధ్య 0.50 సెంట్లు

Item No.5

R.S. No: 641/1-1-051/2 సెంట్లుOut off Ac. 2-11 సెంట్లు. East: Land of D. శ్రీరాములు; South: Land of V. విజయవెంకటరావు; West: యిరిగేషన్ చానల్; North: Land of A. తారకం రెండు హద్దుల మధ్య 1.05 1/2 సెంట్లు

Item No. 6

R.S. No. 287/2 సప్లిమెంటరీ RS. No. 730, 547-12 చ.గ.East: Wall of V. Gopala Krishnaiah, South: 3rd Item భూమి మరియు కె. సత్యనారాయణ వగైరా; West: జాయింటు బజారు జి. శేషగిరిరావు ; North:2వ ఐయిటం భూమి రెండు హద్దుల మధ్య 547-12 చ.గ.

Item No. 6B

356 చ.గ. D.No. 4-460లో

East: P. లక్ష్మీనారాయణ and Ch. అంజయ్య గారి దోయి; South: South in 1st Item and site of V. Gopala Krishnaiah; West: బజారు వగైరా; North: Site of T. కోటయ్య మరియు Site in 4th Item

| DHr Value | | Amina Value |
|---|---|---|
| Ist Item: | 5,000/- | 33,750/- |
| 2nd Item: | 5,000/- | 24,300/- |
| 3rd Item: | 5,000/- | 01,62,800/- |
| 4th Item: | 5,000/- | 22,500/- |
| 5th Item: | 5,000/- | 40,000/- |
| 6th Item: | 5,000/- | 50,000/- |
| 6th B Item: | 25,000/- | 02,00,000/- |

వేలం వాయిదా: 12.10.92

**G.S.R. Anjaneyulu**
Advocate for D.H.R.

# తడ స్మగ్లర్లు

(4 పేజీ తరువా)

బాగా తెలుసు కాబట్టి, ఇవంత సజావుగా జరుగుతున్నాయనడం - నింద కాదు, నిజం! ఈ విలేఖరి అర్థం చేసుకున్నంత వరకు, ఆరా తీసినంత వరకు స్మగ్లింగ్ తీరు తెన్నులివి-

మద్రాసుకు బియ్యం ఎగుమతయ్యేందుకు ప్రధానంగా 3 మార్గాలున్నాయి. ఒకటి - రోడ్డు; లారీల కెక్కించి, చెక్‌పోస్టులను దాటించి, రెడ్ హిల్స్‌కు చేర్చడం! రెండు - పడవలు; నాటు పడవలలో పులికాట్ సరస్సు ద్వారా 'సున్నాంబుగోళం' అనే తమిళనాడు గ్రామం చేరుస్తారు! మూడవ మార్గం - రైలు; గూడూరు నుంచి చిన్న చిన్న చేతి సంచులలో మద్రాసుకు చేర్చడం.

ఇందులో పడవలపై వెళ్లే బియ్యం పెద్దగా ప్రజల కంట పడదు. పులికాట్ సరస్సున వున్న వాటంబేడు, మాంబట్టు గ్రామాలనుంచి తరలిస్తారు. ఈ రెండు గ్రామాలకు చెందిన వారే ఈ రూట్‌లో పేరుమోసిన స్మగ్లర్లు. వీరికి పులికాట్ దీవుల్లోని మత్స్యకారులతో సన్నిహిత సంబంధాలుంటాయి. విజిలెన్స్ అధికారులకు పోలిసీయే అందదు. ఒకవేళ వారు దాడిచేయ సంకల్పించినా, సరస్సులోకి పడవ నడపడానికి ఎవరూ ముందుకురారు. ఈ మార్గంలో జరిగే స్మగ్లింగ్ నిరోధంలో విజిలెన్స్ వైఫల్యాన్ని కొంతవరకు అర్థంచేసుకోవచ్చు. కాని నేషనల్ హైవేపై తరలివెళ్లే ప్రతి లారీలోను అధికారులకు భాగస్వామ్యం వుంది.

రోడ్డుపై వెళ్లే ప్రతి లారీ ఏదోఒక చెక్‌పోస్టును దాటాలి. నేషనల్ హైవేకు పడమర వైపు గ్రామాలైన మాంబట్టు, చినమాంబట్టుల నుంచి ఎడ్లబండ్లమీద ధాన్యం తెచ్చి రోడ్డుకు కొద్దిదూరంలో స్టోర్ చేసి, లారీల కెక్కించడం ఒక పద్ధతి. మాంబట్టు మీదుగా బత్తుల వల్లం చెక్‌పోస్టుదాటి కొన్నిలారీలు వెళ్తే, వరదయ్యపాళెం నుంచి చిలమత్తూరు, మెత్తరమెట్లల మీదుగా ఇంకొన్ని వెళ్తాయి. వీటి గమ్యస్థానం -తమిళనాడులోని నాయుడుకుప్పం.

అది అడ్డదారి. ఈ న్యూసెన్స్ లేకుండా గూడూరు, నాయుడుపేట, దొరవారిసత్రం ప్రాంతాల నుంచి పబ్లిక్‌గా వెళ్లేవి ఇంకొన్ని. వీటి గమ్యస్థానం రెడ్‌హిల్స్. సూళ్ళూరుపేట సివిల్ సప్లయిస్, తడ పోలీసు స్టేషన్, భీములవారి పాళెం ఇంటిగ్రేటెడ్ చెక్‌పోస్టుల మీదుగా వెళ్తాయివి. తుందూరు సొసైటీరోడ్డు నుంచి ఇంకొన్ని లారీలు వెళ్తుంటాయట.

గూడూరు నుంచి సూళ్లూరుపేట వరకు ప్రతి రైల్వేస్టేషన్ నుంచి రోజూ వంద టన్నుల వరకు బియ్యం తరలి పోతుంటాయి. ఈ మార్గంలో స్మగ్లింగ్ అంతా స్త్రీల చేతులమీదుగా జరగడం విశేషం. నూరు, నూటయాభైమంది మహిళలు చిన్న చిన్న చేతి సంచులలో బియ్యం తీసుకొని రైళ్లెక్కి, తమిళనాడు సరిహద్దు దాటిన తర్వాత ఆగే స్టేషన్‌లో దించుతారు. ప్యాసింజర్లేకాదు, ఎక్స్‌ప్రెస్ రైళ్లలోను వీరి న్యూసెన్స్ తప్పదు. ఒక్కొక్కసారి పెట్టెల్లో కాలు మోపడానికి కూడా సందు వుండదు. స్టేషన్‌మాస్టర్లు, రైల్వేడ్రైవర్లు, గార్డులు, సిగ్నల్ సిబ్బంది తదితరాలందరికీ ఈ మహిళలు లంచం ముట్టచెబుతారు. తడనుంచి ఆరంబాకం వరకు సైకిళ్లపైన బియ్యం చేరవేసేవారు 30మంది వరకు వున్నారు.

లారీలలో వెళ్లే ధాన్యమే అన్నిటికంటె పెద్ద మొత్తంలో వుంటుంది. ప్రతి స్మగ్లర్‌కూ స్వంత లారీలుంటాయి. మాంబట్టు గ్రామానికి చెందిన నాగరాజారెడ్డి, సత్యంరెడ్డి, చిల్లకూరు హరనాథరెడ్డి, దశరథరామిరెడ్డి; ఎస్.ఎం.ఖంద్రిగకు చెందిన జనార్దనరెడ్డి, ఆరంబాకంకు చెందిన మణి, గజేంద్రన్, జనార్దనరెడ్డి, సూళ్లూరుపేటకు చెందిన సుధాకర్, రంగనాథం, సుబ్బరామిరెడ్డి, దొరవారి సత్రానికి సంబంధించి రమణారెడ్డి, కస్తూరి రెడ్డి వంటివారికి లారీలలో జరిగే స్మగ్లింగ్‌తో సంబంధాలున్నాయని ఆరోపణ. వీరందరికీ విజిలెన్స్ అధికారులతో ప్రత్యక్ష సంబంధాలున్నాయి. మద్రాసుకు వెళ్లే ప్రతిలారీ లోడ్‌కూ స్మగ్లర్లువిజిలెన్స్ వారికి 2వేలు లెక్కన లంచం ఇస్తారు. ఇతర లంచాలు, పోలీసు స్టేషన్ మామూళ్లు, ఖర్చులు పోను లోడ్‌కు 3వేల నికర లాభం మిగులుతుందట. ప్రతి లారీ రోజుకు కనీసం 2 ట్రిప్‌లు వేస్తుంది. దాదాపు 40 లారీలను నిత్యం దీనికోసం వినియోగిస్తారు. క్రమం తప్పకుండా మద్రాసు నెల్లూరుల మధ్య తిరిగే లారీ నంబర్లను స్థానికులు కొందరు నోట్‌చేసి పెట్టుకున్నారు. అవి ఇవి: టిఎంఎఫ్ 5796, ఎటిసి 3273, ఎండిఎన్ 8505, ఎటిఆ 2356, ఎటిఎన్ 4040, ఎహెచ్ఆ 9997, ఎపి 7 V 1395, ఎపి 26- 2334,ఎపి 26- 2394, ఎపి26- 2747, ఎటిఆ - 3373, ఎపిటి V-1314,టిఎంబి -9897, ఎబల్ -7889, ఎపిTV-1278, ఎఎఎన్ -9819, ఎపిక్యు 9990, టిఎహెచ్ - 2919. వీటన్నింటికీ జాక్‌పాట్ లారీలని పేరు. ఇవి కళ్లబడితేచాలు-జనం రోడ్డు ప్రక్కకు పరుగులు పెడతారు. దారికి అడ్డం వచ్చిన వారినెవరినైనా నిర్దాక్షిణ్యంగా త్రొక్కించి చంపడం వీరికి మంచి నీళ్లప్రాయం.

ఎక్కడో వుండే గంధపు చెక్కల వీరప్పన్ గురించి మాట్లాడుకుంటాము గాని -సూళ్ళూరు పేటలో ప్రతి ధాన్యం స్మగ్లరూ ఒక వీరప్పన్‌వలె ప్రవర్తిస్తాడు. అధికారులను కొట్టడం, చంపడం వీరికి సాధారణ విషయం. ఒక సూళ్లూరుపేట తహసిల్దారును వీరు గోపాలరెడ్డిపాళెం గ్రామంలో చెట్టుకు కట్టి కొట్టారు. చెప్పుకుంటే సిగ్గుచేటని ఆయన సైగ్గావుండి పోయాడప్పుడు. ఒక విజిలెన్స్ ఎస్ఐని టపాగుడిసెల వద్ద లారీతో త్రొక్కించారు. తడ పోలీసు ఎస్ఐ నాగేశ్వరరావును నడివీధిలో లారీలతో క్రిందటేడు కిరాతకంగా త్రొక్కించి చంపించింది తెలిసిందే. మన పోలీసు లెంత నీచులంటే, తోటి ఎస్ఐను చంపిన స్మగ్లర్లను కనీసం అరెస్టుకూడా చేయలేదు. ఆ కేసు మాఫీకి సైతం లక్షలలో లంచాల అమేధ్యం గతికారని ప్రతీతి. ఒకసారి కాళహస్తి డిఎస్‌పి చేతులు విరగగొట్టారు స్మగ్లర్లు. విజిలెన్స్ సిబ్బంది పట్టుకొన్న లారీలను, తిరిగి వారి కళ్లముందే దౌర్జన్యంగా తీసుక వెళ్లడం స్మగ్లర్లకు అలవాటు. ఇటువంటి సంఘటనలలో విజిలెన్స్ అధికార్లు తమ వళ్ళు తమది కానట్లు స్మగ్లర్లకు అప్పచెప్పేస్తుంటారు.

ఈ సంఘటన లేవీ పత్రికలలో ప్రచురితం కావు. తడ, సూళ్ళూరుపేటలలో పనిచేసే ప్రతి దినపత్రికా విలేఖరి స్మగ్లర్లను చూసి దెయ్యాలను చూసినట్లు జడుసుకుంటారు. ఎవరైనా ఒక విలేఖరి సాహసించి ఒక వార్త వ్రాస్తే- గంటలోపల స్మగ్లర్ పంపే కిరాయి రౌడీలు అతడి ఇంటి ముందు చేరి నానా బీభత్సం చేయడం సర్వసాధారణం. గూండాలమని నేరుగా వచ్చి బెదిరిస్తారు. ఏ పోలీసు అధికారి నుంచి విలేఖర్లకు రక్షణ లభించదు-అసలు పోలీసులకే రక్షణ లేదు. సూళ్ళూరుపేట ఎస్ఐ ఒకరిని, అతడు పనిచేసే స్టేషన్‌లోనే, పోక్తాత్తు సర్కిల్ ఇన్స్‌పెక్టర్ సమక్షంలో ఒక స్మగ్లరు దేహశుద్ధి చేసిపోయాడట. "నీ పెళ్ళాం కట్టే చీరా, రవిక మేమిచ్చే మామూళ్లతో కొనే నీచుడివి నువ్వు, నువ్వేందిరా మమ్మల్ని పట్టుకొనేది" అని తూలనాడారట. స్టేషన్‌మొత్తం ఆ స్మగ్లర్ తిట్లను విస్మయంగా విని, తల దించుకొన్నారట. సిఐగారు సైతం నోరు తెరవలేక పోయారట. ఈ పరిస్థితులలో ఏ విలేఖరి స్మగ్లర్ల కార్యకలాపాలపై వార్తలు వ్రాయగలరు చెప్పండి!

ప్రతి స్మగ్లర్‌కూ రాజకీయపరమైన అండ వుంది. ఎమ్మెల్యేలనుంచి, మంత్రులనుంచి, స్థానిక కాంగ్రెస్, తెలుగుదేశం నాయకుల వరకు వీరి కొమ్ముకాస్తుంటారు. పట్టుకొన్న లారీలను క్షణాలలో విడిపిస్తారు. సాయంత్రానికి కేసులు మాఫీ అయిపోతాయి. 90శాతం కేసులు కోర్టుల వరకు కూడా వెళ్లవు. ఏ స్టేషన్‌లోనూ రికార్డు వుండదు. స్మగ్లర్లకు పత్తాసుగా రౌడీమూకను తయారుచేసి, బాధ్యత రాజకీయవాదులది. గ్రామాలకు గ్రామాలనే వీరు కిరాయి గూండా స్థావరాలుగా మార్చేస్తున్నారు. ఈ ప్రాంతంలో నియమింపబడే ప్రతి ఉద్యోగి, అధికారి వీరికి గులాముల మాదిరి పడివుండవలసిందే. లేకుంటే బదలీ ఉత్తర్వులు టెలిగ్రామ్‌లపైన వస్తాయి. తమ మాట వినని స్మగ్లర్లను అధికారుల సహకారంతో ఏడ్పించడం వీరి దినచర్యలో ఒక భాగం.

అప్పుడప్పుడు విజిలెన్స్ అధికారులు పట్టుకొన్నట్లు పత్రికలలో వచ్చే వార్తలు పచ్చి బోగస్. తమకు మామూలు ఇవ్వకుండా వెళ్లే లారీలను పట్టుకొని గంటలోపల వదిలి వేయడం తప్ప, కేసులు, గీసులు పెట్టరు. అధికారుల చేతకాని తనం, అవినీతుల ఫలితంగా స్మగ్లర్లు ఎంత బరితెగించి పోయారంటే, గతవారంలో ఆర్‌టిసి బస్సును గుద్ది, 16మంది గాయపడడానికి , ఒక ప్రయాణీకుడి మృతికి కారణమైన స్మగ్లింగ్ లారీలోని ధాన్యాన్ని, అధికారుల సమక్షంలోనే వేరే లారీ తెచ్చి, లోడ్‌చేసుకవెళ్లారు స్మగ్లర్లు. ఇటువంటి అధికారులను నపుంసకులని అంటే, ఆ జాతివారికి కోపం రావడంలో తప్పుందంటారా?

అధికారులు తలచుకుంటే, ఒక్కటంటే ఒక్క వారంలో మద్రాసుకు లారీ కదలకుండా చేయగలరు. కాని వారా సంకల్పం చేయరు. చేస్తే -లక్షల లంచాలు చేతికి అందవు. సూళ్ళూరుపేట సివిల్ సప్లయిస్ చెక్‌పోస్టులో గత ఐదారేళ్ల నుంచి బదలీలు లేవు. కలెక్టర్ వంటి ఉన్నత అధికారులను సైతం రాజకీయ వత్తిడులకు గురి చేసి, తమకు బదలీలు రాకుండా జాగ్రత్త పడి, దోచుకుంటున్నారు వారు.

తడ ధాన్యం స్మగ్లింగ్ ఒక విషవలయం వంటిది. రెవిన్యూ, విజిలెన్స్, సివిల్ సప్లయిస్, పోలీసు, కమర్షియల్ ట్యాక్సెస్ వంటి ప్రభుత్వ విభాగాలన్నీ కలిసి ఈ చక్రాన్ని ఏర్పరుస్తున్నారు. దానికి పరిరక్షకులు - రాజకీయవాదులు. దాన్ని ఎవరు ఛేదించరు. ప్రభుత్వం పరువు ప్రతిదినమూ పబ్లిక్ రోడ్‌లో గంగపాలు అవుతున్నా వీరికి లక్ష్యం లేదు. అది అంతే!



'పంసాలపొగ్గాడు' లో బాబూమోహన్, బ్రహ్మానందం

# హిందీ తారలకు పత్రికలకు మధ్య మళ్ళీ సమరం

హిందీ నటుడు అనుపమ్‌ఖేర్ ఒక తార చెల్లెల్ని చెయ్యి పట్టుకున్నాడని "స్టార్ డస్ట్" పత్రికలో వెలువడిన వార్త నానా గొడవలు సృష్టించింది. ఆ వార్త రాసిన విలేఖరిని అనుపమ్‌ఖేర్ కొట్టాడు. ఈ దుందుడుకు చర్యను ఖండిస్తూ, మరి కొన్నిపత్రికలు అనుపమ్‌ఖేర్‌ను తూర్పారబట్టాయి. ఫలితంగా 1,79,612 ప్రతులు విక్రయమయ్యే "స్టార్ డస్ట్" సినీ బ్లిట్జ్ (83,890) మూవీ (75,040) షోటైమ్, ఫిలిమ్ సిటీ, స్టార్ అండ్ స్టయిల్" ఆంగ్ల పత్రికలను బొంబాయి సినీ ఆర్టిస్ట్స్ అసోసియేషన్ బహిష్కరించింది. ఆదిలో ఏ నటీనటులకైనా సినిమా పత్రికలు ఎంతో పబ్లిసిటీ ఇస్తాయి. ఆ పబ్లిసిటీ లేనిదే ఏ ఆర్టిస్టూ తారాపథాన్ని అందుకోలేరు. అందుకున్నాక తమ పురోగతికి కారకులైన పత్రికల వారిపై ధ్వజమెత్తడం వారి సంస్కారలేమిని తెలుపుతుంది. ఇలా ఇది వరకు కొన్ని సార్లు తారలకు పాత్రికేయులకు మధ్య ఘర్షణలు జరిగాయి. కాలక్రమాన అవి సమసిపోయాయి. ఐతే, ఈ మారు మాత్రం తారాస్థాయికి అందుకున్నాయి. ఎటొచ్చీ ప్రజలకు తారలు ఎంత అవసరమో, పత్రికలు కూడా అంతే అవసరం.

### సెన్సార్ హెచ్చరిక : నిర్మాతల దిగులు

# సెక్స్ పేరెత్తితే కత్తెర - మడి కట్టుకుంటే మా గతి?

"వ్యాంప్ పాత్రధారులు కేబరే నృత్యాలు చేస్తే ఏ మాత్రం అభ్యంతరం చెప్పం. కాని కథానాయికలు అదే డాన్సు చేస్తే ఖచ్చితంగా కట్ చేస్తాం. నిర్మాణంలో ఉన్న నిర్మాతలు ద్వంద్వార్థపు మాటలు, మితిమీరిన శృంగార దృశ్యాలు లేకుండా ఇప్పుడే జాగ్రత్త పడాలి. నేను సెన్సార్ బోర్డు ప్రాంతీయ అధికారిగా ఉన్నంతవరకు అసభ్యత, జుగుప్స కలిగించే దృశ్యాలను అనుమతించను. నేను ఎటువంటి ఒత్తిడికి లొంగను. అక్టోబర్ నుండి కఠినంగా వ్యవహరిస్తాం" అని కైలాశ్ ప్రసాద్ చేసిన హెచ్చరికలు అప్పుడే కొందరు నిర్మాతల గుండెల్లో గుబులు నిలిపాయి. "ఇలా మడికట్టుకున్న సిన్మాలు తీస్తే ఏ బయ్యర్ కొంటాడు? ప్రేక్షకులు ఏం చూస్తారు?" అని ఒక నిర్మాత తన దిగులును వెలిబుచ్చాడు కూడా.

## "చింతామణి" మానుకున్నట్లే

పలు చోట్ల నుంచి వచ్చిన వేశ్య సంఘాల నిరసనలకు, పత్రికలలో వచ్చిన వార్తలకు స్పందించి, తాను, తమ సురేష్ ప్రొడక్షన్స్ పతాకంలో దాసరి దర్శకత్వంలో నిర్మించ తలపెట్టిన 'చింతామణి' నిర్మాణ తలంపును విరమించుకున్నట్లు నిర్మాత శ్రీ రామానాయుడు స్పష్టం చేశారు. ఎవ్వర్నీ నొప్పించే మనస్తత్వం కాదు నాది. మనస్తాపాలకు, వివాదాలకు దూరంగా ఉండటం నా మతం అని ఆయన తెలియజేశారు.

తానే రామానాయుడు చేత ఈ చిత్ర నిర్మాణాన్ని విరమింపజేసినట్లు దాసరి నారాయణరావు వేరుగా ఒక పత్రికా ప్రకటనలో పేర్కొన్నారు.




## హిందీ "బ్రహ్మర్షి విశ్వామిత్ర" రిపేరు

తెలుగు చిత్రం అపజయాన్ని చవి చూసినా హిందీ "బ్రహ్మర్షి విశ్వామిత్ర" చిత్రం మీద ఎన్టీఆర్ ఇంకా ఆశ వదులుకోలేదు. ఈ చిత్రంలో వదులుగా ఉన్న మేకులను బిగించడానికి అహర్నిశలూ శ్రమిస్తున్నారట. బాలకృష్ణ పాల్గొన్న శకుంతలోపాఖ్యానాన్ని హిందీలో అరుణ్ గోవిల్ (టి.వి. రామాయణంలో శ్రీరాముడు)తో మళ్లీ చిత్రీకరిస్తున్నారు. మరి కొన్ని ఉపాఖ్యానాలను విశ్వామిత్రుని దృక్కోణం నుంచి ఆత్మకథలూ, స్వీయానుభవంలో చెప్పడానికి ప్రయత్నిస్తున్నారు. వెల్డింగు, ఓవర్‌ఆయిలింగ్, రిబోరింగ్ వగైరా రిపేరిలు చేసి, కొత్త పెయింటుతో విడుదల చేసినా తెలుగు చిత్రానికి లభించిన ఆదరణ ఏ పాటిదో ఉత్తరాది వారికి తెలియనిది కాదు.

## దోపిడీ నుంచి తప్పించుకున్న సితార

ఇటీవల తిరుపతిలో "మా వారి పెళ్లి, గౌరమ్మ" చిత్రాల షూటింగును ముగించుకొని నాయుడుపేట మీదుగా మద్రాసుకు వస్తున్న సితార మహా

కొరవ 11 పేజీలో

### కథానాయిక అంగాంగాల ప్రదర్శన తప్పమరేమీ లేదు:

# ప్రేమ విజేత

సురేష్‌ప్రొడక్షన్స్ అధినేత డి.రామానాయుడు నిర్మాణ పరంపరలో తాజాగా నిర్మింపబడిన "ప్రేమ విజేత" చిత్రంలోని రాజ్యం (రోజా), అనే పల్లెటూరి పిల్ల చాలా చలాకీగా కనిపిస్తుంది. ఆ పిల్ల కట్టుకున్న పావడా మోకాళ్ల క్రిందికి దిగిదిగనట్టు, వేసుకున్న జాకెట్ చాలీచాలనట్టుగా వుంటాయి. ఆటపాటల్లో మోకాళ్ల దాకా వున్న పావడా గిర్రున తిరిగి నడుం వరకు ఎగబ్రాకుతుంది. అది సర్దుకునే ప్రయత్నం ఆ అమ్మాయి చెయ్యదు. సర్దుకోవడానికి దర్శకుడు అంగీకరించడు. ఆ పిల్ల నాజూకైన కాళ్లు యావత్తూ ప్రేక్షకులకు చిత్రం పొడవునా దర్శనమిస్తాయి. ఆ పైన జాకెట్టు సంగతి కొస్తే, వక్షోజాల పైన పైట వుంటే వుంటుంది లేకుంటేలేదు. పైట వున్నప్పుడు కూడా అది ప్రతి పక్కంలో పరోక్షంగా వుంటుంది. తన కర్తవ్యం మరచి ఒక ప్రక్కకు తొలగి వుంటుంది. ఆ పిల్ల తెర మీద కనిపించిన ప్రతి క్షణం వక్షోజాల ప్రదర్శన జరుగుతుంది. వాటి ప్రదర్శన చూస్తూ ప్రేక్షకుల కళ్లు వాటి చుట్టూ ప్రదక్షిణం చేస్తూ వుంటాయి. అందంగా కనిపించే ఆ అమ్మాయి అప్పుడప్పుడూ కన్ను గొట్టి ప్రేక్షకులను గిల్లుచేస్తుంది. ఒక స్విమ్మింగ్ డ్రమ్ములో సరేసరి. బోర్లా వెల్లికిలా తిప్పించి మళ్లించి పండబెట్టి అన్నీ చూపెట్టి కంటినిండా పంట పండిస్తాడు దర్శకుడు.

ఈ అమ్మాయి, ఆమె ప్రేమికుడు రాజా పట్టణంలో గడిపిన రాత్రి చూడ ముచ్చటగా వున్నా, అంగాంగాల ప్రదర్శన రోతకల్గిస్తుంది. చిత్రం సగ భాగం ఇటువంటి అంగాంగ ప్రదర్శనలతో ప్రేమికుల ఆటపాటలతోనే సరిపోతుంది.




ఇలాంటి అర్ధనగ్న దృశ్యాలు కుర్రకారును, శృంగార ప్రియులను పరవశింపజేసేందుకు ఒప్పించటం మన సినిమాల్లో కొత్తేమి కాదు. "ప్రేమ విజేత" చిత్రంలోనూ ఆ పాత, రోత, బూతు, ద్వంద్వార్థ విషయాలు అక్కడక్కడా వున్నాయి. మన సినిమా రంగంలోని నిర్మాతలు ఎక్కువగా ఇలాంటి 'కమర్షియల్ టచ్' తో చిత్రాలు నిర్మించి లాభాలు గడించాలనే ప్రయత్నంలో వున్నారు.

డి. రామానాయుడు కేవలం పెట్టుబడి పెట్టిగుట్టుగా వుండే వారు కాదు. చిత్ర నిర్మాణంలో ప్రతిదీ స్వయంగా చూస్తాడు. కెమెరాలోనుంచి చూస్తాడు. క్లాప్ కొట్టాడు. మేకప్ సరిలేకుంటే సరి చేస్తాడు. అలాంటి రామానాయుడుకి ప్రేమ విజేత చిత్రంలోని రాజ్యం పాత్ర ధరించిన పావడా సరిచెయ్యటం తెలియలేదా? కన్నుగొట్టే చేష్ట ఆపటం చేత కాలేదా? పరుచూరి బ్రదర్స్ వ్రాసిన బూతులు, ద్వంద్వార్థ పదాలు తొలగించాలన్న నైతిక బాధ్యత లేదా? అందరిలాగా కమర్షియాలిటీకి దిగజారి డబ్బుకు కక్కుర్తి పడవలసిన అవసరం రామానాయుడికి లేదు. ఆదర్శవంతమైన, కళాత్మకమైన చిత్రాలు నిర్మించ గల అనుభవము, ఆర్థిక స్థోమతా ఆయనకున్నాయి. అంతే కాదు, రామానాయుడు తన ప్రతి చిత్రం ద్వారా ఒక కొత్త దర్శకుణ్ణి పరిచయం చేస్తున్నారు. బాగానే వుంది. కాని ఆ దర్శకులను కమర్షియల్స్‌గా తయారు చెయ్యకుండా, కె. విశ్వనాథ్ లాంటి ఒక్క దర్శకుణ్ణయినా తయారు చెయ్యటం అవసరం. రామానాయుడు ఈ విషయం గుర్తించాలి.

కొరవ 11 పేజీలో



## శ్రద్ధాంజలి

మా ప్రియ మిత్రుడు మాలో ఒకడు, స్నేహశీలి, ఉదార స్వభావి, వినయశీలి.

**మునగా సంజీవరావు గారు**

16.9.92 తేది మమ్ము శోక సముద్రంలో ముంచి హఠాత్తుగా పరమపదించారు. వారి ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తూ వారి కుటుంబానికి మా ప్రగాఢ సానుభూతి తెలియజేస్తున్నాము.

*J.L. నారాయణ మరియు స్టాఫ్*

**J.L. నారాయణ అసోసియేట్స్**
**J.L. కాంప్లెక్స్, ట్రంకురోడ్డు**
*నెల్లూరు - 1 ఫోన్ 26729*

## జిల్లా వార్తలు

(5 పేజీ కొరవ)

మందిరంలో సామూహిక వివాహాలు నిర్వహిస్తున్నారు. ఈ కార్యక్రమానికి విచ్చేసే వధూవరులకు మంగళ సూత్రాలు, నూతన వస్త్రాలు బహూకరించ బడుతాయి. వర్ణాంతర వివాహాలు చేసుకోదలచిన ఎస్.సి. ఎస్.టి. తెగలవారికి ప్రభుత్వపాలసీ ప్రకారం మూడువేల రూపాయల సహాయం అందిస్తారు. ఈ సామూహిక వివాహ కార్యక్రమంలో పెళ్లిచేసుకోవాలను కునేవారు సాయి మందిరంలో ఈ నెల 30వతేది లోగా పేర్లు నమోదు చేసుకోవాలని అసోసియేషన్ అధ్యక్షుడు డాక్టర్ సి.ఆర్.రెడ్డి చెబుతున్నారు.

### నాలుగేళ్లుగా బీడు పడిన భూములు

విద్యుత్ శాఖాధికారుల నిర్లక్ష్యవైఖరి వల్ల గత నాలుగేళ్లుగా బీడు భూములుగా మారివున్న వ్యవసాయ యోగ్య భూముల ఉదంతమిది. రాపూరు మండలం జోరేపల్లి అక్కమాంబాపురం గ్రామంలోని ఎస్.సి.,బి.సి. కులాలకు చెందిన ప్రజలకు ప్రభుత్వం నాలుగేళ్ల క్రితం ఉచితంగా భూమి నిచ్చింది. ఈ భూముల్లో నీటి పారుదల సౌకర్యం కల్పించను జీవనధార, రోజ్‌గార్ యోజన పథకాల ద్వారా నిధులు మంజూరు చేసింది. దీనితో లబ్ధిదారులు రెండేళ్ల క్రితమే బావులు త్రవ్వు కున్నారు. త్రవ్వుకున్నదే తడవుగా ప్రభుత్వం విద్యుత్ మోటార్లను పంపిణీ చేసింది. వీటిని తీసుకొని తమ భూముల్లో పంట పండి కష్టాలు తీరడం ఖాయమనుకొని ఆ పిచ్చివాళ్ళు కలలు గన్నారు. కాని వారి కలలు కలలుగానే మిగిలిపోయాయి. తమ మోటార్లకు విద్యుత్ కనెక్షన్‌లు ఇవ్వమన్న రైతుల గోడును విద్యుత్ శాఖాధికారులు పట్టించుకోలేదు. గత రెండేళ్లు గా అధికారులు, రాజకీయ నాయకుల చుట్టూ తిరిగి విసిగి వేసారి పోయారు. ఇది ఇలా ఉండగా ఇటీవలే ప్రభుత్వం మోటర్లకు ఇచ్చిన 'మార్జిన్‌మనీ' చెల్లించమని పంపిన ఉత్తర్వులు చూసి రైతులు విస్తుపోయారు. అలూలేదు చూలు లేదు అన్నరీతిలో తమకు కనీసం విద్యుత్ సౌకర్యం కల్పించలేని అధికారులు మార్జిన్ మనీ ఉత్తర్వు తీసుక రావడాన్ని చూసి ఆగ్రహం వ్యక్తపరుస్తున్నారు. ఇంతకీ అక్కమాంబాపురం లబ్ధిదారులు భూములు సాగుచేసే యోగ్యంలేదా ?

### సూళ్ళూరు పేట పంచాయితీ పన్ను పెంపు

సూళ్లూరు పేట గ్రామ పంచాయితీ పరిధిలో ఇళ్ల పన్నులు అధికం చేయడం పట్ల గ్రామస్తులు ఆవేదన వ్యక్తపరుస్తున్నారు. 91సంవత్సరంలో చెల్లించిన దానికన్నా 92లో 40శాతం ఎక్కువ కట్టవలసి వచ్చిందంటున్నారు. ఇంటి పన్నులు విధించేందుకు నియమించిన వాల్యుయేషన్ కమిటీ క్రమపద్ధతిలో ఈ కార్యక్రమం నిర్వహించక పోవడంతో ఒకచోట పన్ను పెరిగితే, మరోచోట తగ్గిపోయింది. ఎగుడు, దిగుడు పన్నుసరిచేసే అధికారం గ్రామపంచాయితీకి లేకపోవడం దారుణమంటున్నారు-పంచాయితీ సభ్యుడు పిచ్చిక మునికృష్ణయ్య. జిల్లా పంచాయితీ అధికారులు ఈ విషయాన్ని పరిశీలించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

### కలువాయి కాల్పుల పై30తేది విచారణ

కలువాయిలో సహకార ప్రాథమిక సంఘాల ఎన్నికల సమయంలో జరిపిన కాల్పుల విషయమై నెల్లూరు రివిన్యూ డివిజనల్ ఆఫీసర్ విచారణ నిర్వహిస్తారు. ఈ నెల 30తేది ఉదయం 11గంటల నుండి సాయంత్రం 5గంటల వరకు కలువాయి ఎమ్మార్వో కార్యాలయంలో విచారణ నిర్వహిస్తారు. సంఘటనను చూచిన ప్రత్యక్ష సాక్షులు ఇతర వ్యక్తులు తమకు తెలిసిన సమాచారాన్ని అందించవచ్చుని అధికారులు ఒక ప్రకటనలో కోరుతున్నారు.

### గజచోరుల అరెస్ట్

దక్కిలి, సైదాపురం, పొదలకూరు ప్రాంతాల్లో జరిగిన అనేక దొంగతనాల్లో సంబంధమున్న 8మంది గజదొంగలను 19తేది రాత్రి వెంకటగిరి పాతకోట వీధిలో పోలీసులు వలపన్ని పట్టుకొన్నారు. వీరివద్ద నుండి లక్షరూపాయలు విలువ చేసే బంగారు నగలు స్వాధీనం చేసుకొన్నారు. వెంకటగిరి సర్కిల్ ఇన్‌స్పెక్టర్ శ్రీ అంబేరావు, దక్కిలి ఎస్.ఐ. శ్రీహసనయ్య, నేతృత్వంలో పోలీసులు ఈ దొంగలను పట్టుకొను విశ్వప్రయత్నంచేసి, విజయం సాధించారు.

## పినాకినీ తీరం

(5 పేజీ కొరవ)

మాసాల నుండి అందరూ, అన్ని శక్తులూ ఒకటై, విశ్వ ప్రయత్నంతో చేయలేని పనిని, జనార్దనరెడ్డి తనకు తానుగా చేసుకున్నాడు; రాజకీయ చతురతతో గాని మరే ధీమాతో గాని అరిభయంకరు డనిపించుకున్న జనార్ధనరెడ్డి- ముంచుకొచ్చిన పరిస్థితులకు తలవొగ్గి పోవలసి వచ్చింది. ఎన్నో రాజకీయ పోరాటాలు జరిపి, విజయుడైన జనార్దనరెడ్డి- చివరకు తన చేతిలో తాను ఓడిపోవలసి వచ్చింది. మిత్రులకు శ్రేయోభిలాషులకు బాధాకరమైన విషయం ఇది.

జనార్దనరెడ్డి ప్రతిభావంతుడు, అఖండ ప్రజ్ఞావంతుడు, అద్వితీయమైన సమయస్ఫూర్తి, ఇరవై ఏళ్లలో ఎనభై ఏళ్ల వున్నతస్థాయి అనుబంధాలను, అనుభవాన్ని గడించగలిగిన సమర్థత, విజ్ఞత, వుచితజ్ఞతలు కలిగిన అఖండుడు. అటువంటి జనార్దనరెడ్డికి ఏ దుర్ముహూర్తాన ఆలోచన కొచ్చిందో, ఏ చెడు ఘడియల్లో నిర్ణయం జరిగిందో గాని దాని పరిణామం ఎంత దారుణంగా వుండగలదో వూహించలేక, చిన్నపొరపాటు చేసి, పెద్ద మూల్యం చెల్లించవలసి వచ్చిందంటే ఆశ్చర్యం కాదు తీరని ఆవేదన కలుగుతున్నది. తెలివి గలవారు తప్ప ఇటువంటి పొరపాట్లు చేయలేరేమో?

ఆయన ఏదో చేసి వేయాలనే తొందరపాటుతో వున్నా, సాధక బాధకాలనూ గూర్చి వివరించి

సత్సలహాలతో హెచ్చరించగలిగిన శ్రేయోభిలాషులెవరూ లేకుండా పోయారా? వున్నా మొగమోట పడ్డారా?

ముఖ్యమంత్రిగా జనార్దనరెడ్డి వైదొలగవలసి రావడంతో సింహపురి చిన్నబోయింది. మొన్నటి వరకు వ్యతిరేకంగా వున్నవారు, తిరుతున్న వారు, ఏ సంబంధం లేని వారు సైతం ఆయన పదవి నుండి దిగిపోతున్నాడంటే ఏదో పోగొట్టుకున్నట్టు భావిస్తున్నారు, సానుభూతి ప్రదర్శిస్తున్నారు. ముక్కు, మొహం, తెలియని వ్యక్తి ఒకరన్నారు - "ఈయనే పోతే ఎటువంటి వాడొస్తాడో, ఏమైనా మనవాడు ముఖ్యమంత్రిగా వుండడం మనకి మంచిది" అది అతని వ్యాఖ్య. జనార్దనరెడ్డి దిగిపోతున్నందుకు సంతోషించే వారు లేరని కాదు -అటువంటి వారు రాజకీయ వాదులు, వ్యక్తిగతంగా ఆయన వ్యతిరేకులై వుంటారు. ముఖ్యమంత్రిగా దిగిపోయినందు వల్ల నష్టం వ్యక్తిగతంగా జనార్ధనరెడ్డికి కాపచ్చు; సమష్టిగా జిల్లా అంతటికి అనే అభిప్రాయం సర్వత్రా వుంది. మళ్లీ జనార్దనరెడ్డికి అవకాశం లభిస్తే తప్ప, ముఖ్యమంత్రి కాగలిగిన నెల్లూరీయుడు దూరపు భవిష్యత్తులో కూడా కనబడడం లేదు.

ఏమైనా ఇంతలో ఏది జరగకూడదని, జరగదని పరిపూర్ణ విశ్వాసంతో వుండినామో అదే జరిగిపోయింది. దానికి పరితాపం చెందడం తప్ప చేయగలిగింది లేదు.

నవల

## జనవాణి

3 పేజీ కొరవ

ఉపాధ్యాయులు పెన్షన్ పెంపుదలకై హైకోర్టులో రిట్ వేయడం జరిగింది. హైకోర్టు తీర్పు మేరకు ప్రభుత్వం 91లో జి.వో.292జారీ చేసింది. ఈ ఉత్తర్వులు విడుదలై 10నెలలైనా జిల్లాలోని సబ్ ట్రెజరీ కార్యాలయ అధికారులు అరియర్ చెల్లింపులో జాప్యం చేస్తున్నారు. దీనివల్ల ఉపాధ్యాయ పెన్షనర్లు తీవ్ర ఇక్కట్లకు లోనవుతున్నారు. ముఖ్యమంత్రి ఈ సమస్య పట్టించుకొని పరిష్కరించాలని విజ్ఞప్తి.

నెల్లూరు. -డి. కోటయ్య

## పంచాంగము

### గాంధీజయంతి

తేది 26 శనివారము మహాలయ అమావాస్య

తేది 27 ఆదివారము దేవీనవరాత్రి పూజారంభము, కలశ స్థాపనము

తేది 2 శుక్రవారము సరస్వతి పూజ, గాంధీ జయంతి

### సెప్టెంబర్ తిథులు

భాద్రపద బహుళ

| | | |
|---|---|---|
| తే 26శని అమావాస్య సా. గ. | 4.00 | వ |

ఆశ్వయుజ శుద్ధ

| | | |
|---|---|---|
| తే 27ఆది పాడ్యమి ప.గ. | 2.35 | వ |
| తే 28సోమ విదియ ప.గ. | 12.45 | వ |
| తే 29మంగళ తదియ ప.గ. | 11.15 | వ |
| తే 30బుధ చతుర్థి ప.గ. | 10.10 | వ |

### అక్టోబరు తిథులు

| | | |
|---|---|---|
| తే 1 గురు పంచమి ఉ.గ. | 9.25 | వ |
| తే 2 శుక్ర షష్ఠి ఉ.గ. | 9.15 | వ |

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఎ.,

## చిత్ర సమీక్ష

(9 పేజీ కొరవ)

ఈనాటి నవయువ దర్శకులు కేవలం కమర్షియల్ మనస్తత్వం తోనే దర్శకత్వం వహిస్తున్నారు. ప్రేమ విజేత దర్శకుడు కె. సదాశివరావు కొత్త వాడు. ఈ చిత్రం చూచిన తర్వాత ఇతనూ పూర్తి వ్యాపార తత్వం గల దర్శకుడు గానే తోస్తుంది.

ఇక చిత్రం విషయానికొస్తె ఇది ఒక మామూలు ప్రేమ కథ. ఇటీవల కుర్రజంటలతో తీసే ప్రేమ కథా చిత్రాలు బాగా విజయవంతమవుతున్నాయి. చిత్రం పేరులో గూడా 'ప్రేమ' అనే పదం వచ్చేట్టు చిత్రాలకు పేర్లు పెట్టున్నారు.

ప్రేమ విజేత చిత్రంలో ప్రేమకు కులమతాలకు పోటీ పెట్టారు. ఇందులో రెండు రకాల ప్రేమలు, ఒక మానభంగం వున్నాయి. ఎక్కువగా చిత్రం పల్లెటూరి వాతావరణంలో సాగుతుంది. ఆ ఊరి పంచాయితీ ప్రెసిడెంటు (గొకిన రామారావు) నియంతలా ప్రవర్తిస్తాడు. ఎక్కడ వుండవలసిన వారు అక్కడే వుండాలి. ఏ కులస్థులు ఆ కులస్థులనే పెళ్లిచేసుకోవాలి. అందుకు భిన్నంగా జరిగినప్పుడు ఊరుకట్టుబాటు స్థైటు మారి పోతుందంటాడు.

సంగీతం మాస్టారు కూతుర్ని ప్రెసిడెంటు మనిషి మానభంగం చేసినప్పుడు ప్రెసిడెంటు తప్పు ఆ అమ్మాయిది గానే తీర్పు ఇచ్చి, అలా చెడిన అమ్మాయి ఊళ్లో వుండకూడదని, తానే విషం సరఫరా చేసి అమ్మాయి తండ్రిచేతనే ఆమెను చంపిస్తాడు. అలాగే రామాలయంలో పనిచేసే కులగోత్రాలు లేని అనాధ అయిన శ్రీహరి (సురేష్) కలవారి ఇంటటి అమ్మాయి కస్తూరిని (యమున) ప్రేమించి పెళ్లి చేసుకున్నందుకు, కస్తూరిని ఆమె పెదతండ్రి చేత విషం పెట్టించి చంపిస్తాడు ప్రెసిడెంటు. చివరన తన కొడుకు రాజా ( హరీష్), తన కులం కాని పేద పిల్ల రాజ్యంను (రోజా) ప్రేమించి పెళ్లి చేసుకో బోతున్నాడని ప్రెసిడెంటుకు తెలుస్తుంది. రాజ్యంను నడివీధిలో చెట్టుకు కట్టించి, కొరడాతో కొట్టించి, ఆ పిల్ల తండ్రితో విషప్రయోగం చేయించేందుకు ప్రయత్నిస్తాడు ప్రెసిడెంటు. కాని శ్రీహరి ప్రయత్నంతో ఆ వూరి ప్రజలు ప్రెసిడెంటు పై తిరుగుబాటు చేస్తారు. కులమతాల కట్టుబాట్లను బ్రద్దలు కొట్టారు. తాను ప్రేమలో ఓడిపోయినా రాజా, రాజ్యంలను ప్రేమ పరీక్షలో గెలిపించి ప్రేమ విజేతగా ప్రకటించుకుంటాడు.

చిత్రం సగ భాగం పట్టణంలో ఒక రాత్రి రాజా, రాజ్యంతో తిరగటం, వారు కొన్ని సమస్యలు ఎదురుకోవటంతో సరిపోతుంది. ఇది కేవలం వ్యాపార దృష్టితో చూపబడింది. అసలు కథ, శ్రీహరి, రాజాకు తన ప్రేమకథను ఫ్లాష్ బ్యాక్‌లో చెప్పుటంతో ప్రారంభమవుతుంది. శ్రీహరి ప్రేమ కథ చక్కగా రూపొందింపబడింది.

దర్శకుడు కొన్ని సన్నివేశాలను పట్టుగా చిత్రీకరించాడు. 'నీలో, అల గోదారి వెన్నెల్లా, సందూరి ఎంకిలా నవ్వుతూ'', వేటూరి వ్రాసిన ఈ పాటకు గోదావరి నదిపై పడవ మీద, దర్శకుడు రూపొందించిన దృశ్యం కళాత్మకంగా వుంది. ఈ పాటకు ఇళయరాజా కూర్చిన సంగీతం గూడా కమ్మగా వుంది. శ్రీహరి, కస్తూరి చేత నృత్య దర్శకులు శివసుబ్రహ్మణ్యంలు ఆడించిన కోలాటం నృత్య భంగిమలు చూడముచ్చట గొలుపుతాయి. దర్శకుడు కె. సదాశివరావు కమర్షియల్ టచ్ వదలి పెట్టి, అత వారి చిరా చెంగు ఎక్కడ వుండవలసినవి అక్కడ ఆపిపెట్టి, నటుల చేత సారాయి పేర పశువుల మూత్రం త్రాగించ కుండా, చొకబారు దృశ్యాలు చూపకుండా వుంటె బాగుండేది.

సురేష్ నటనలో చాలా ఉన్నతస్థాయికి ఎదిగారు. నృత్యాలు చెయ్యటంలో, ఫైటింగుల్లో ఒక గట్టి పట్టు బట్టటంలో దిట్ట అయినారు. యమున ప్రతి సన్నివేశాన్ని రక్తి కట్టించింది. హరీష్, రోజా ప్రేమ జంటగా శృంగారం ఒలకపోశారు. గొకిన రామారావు నియంతగా రాణించారు. బాబూమోహన్ హాస్యం జుగుప్సగా వుంది. కస్తూరి పెద్ద తండ్రిగా గుమ్మడి, తండ్రిగా పి.ఎల్. నారాయణ, రాజ్యం తండ్రిగా కోటశ్రీనివాసరావు సహజంగా నటించారు.

పి.ఎస్. ప్రకాష్ ఫోటోగ్రఫీ పరవాలేదు. జూడో రత్నం, రాజా ఫైటింగుల కూర్పు, మంటల్లో తగలబడుతూ చేసిన ఫైటింగులు ఒక రకంగా ఉన్నాయి.

## సింహపురి

(4 పేజీ కొరవ)

సి.రాజేంద్ర కుమార్, ఎ.శ్వేత, టి.మంజుల, విజేతలుగా నిలిచారు. బ్రేక్ డ్యాన్స్‌పోటీలో సి.ఇంద్రవీల్, సి.హెచ్. మనోహర్, సినిమాపాటల్లో టి. చంద్రశేఖరరెడ్డి, డి.వి. వరప్రసాద్, కె.వెంగయ్య బహుమతులు గెల్చుకున్నారు. విజేతలకు సినీపాటల రచయిత; నెల్లూరీయుడు శ్రీ వెన్నెలకంటి రాజేశ్వర ప్రసాద్ బహుమతులు అందజేశారు. డాక్టర్ అక్కినేని ఇంటర్నేషన్ కల్చరల్ అసోసియేషన్ ఈ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసింది.

## చిన్నపిల్లల ఆసుపత్రి ప్రారంభం

టౌన్‌లోని సాయిబాబా మందిరం పక్కన మొన్న 21తేది 'సిద్ధార్థ' చిన్నపిల్లల ఆసుపత్రి ప్రారంభిం పబడింది. యువకుడైన డాక్టర్ జడ్. శివప్రసాద్ ఎంబిబియస్. డి.సి.హెచ్. దీన్ని నెలకొల్పారు. ఆసుపత్రిలోబరువుతక్కువ పిల్లలకు ఇంక్యుబేటరు , కామెర్లవ్యాధి కనుక్కొనే 'ఫోటోథెరఫి' 'వెల్‌బేబి క్లినిక్' వంటి అధునాతన సౌకర్యాలు ఉన్నాయట. ఈ యువడాక్టర్ తండ్రి నెల్లూరీయుడు శ్రీ జడ్. నవహరనాథరావు మాజీ సినీ నిర్మాత; శివప్రసాద్ సతీమణి కూడా డాక్టరేనట. ప్రజాభిమానం పొందే విధంగా క్లినిక్ నడపుతారని ఆశిద్దాం.

## ఎరువుల ధరలు తగ్గుతాయి

ఇటీవల పెరిగిన ఎరువుల ధరలు మరో ఆరు నెలల్లో తగ్గుతాయని కేంద్ర రసాయనాలు, ఎరువుల శాఖ సహాయ మంత్రి డాక్టర్ చింతా మోహన్ రైతులకు భరోసా ఇచ్చారు. 17 తేది సాయంత్రం టౌన్‌లోని రాఘవ కళ్యాణ మండపంలో పెట్రో ఫిల్ సంస్థ చేనేత కార్మికులకు ఏర్పాటు చేసిన శిక్షణా శిబిరాన్ని ప్రారంభించి, ప్రసంగించారు. జాయింట్ పార్లమెంటరీ కమిటీ సిఫార్సుల మేరకే ఎరువుల ధరలు పెంచినట్లు చెప్పారు. డి.ఎ.పి. ఎరువులకు సబ్సిడీ తీసివేయడం వల్ల టన్ను ధర 8 వేల 800 రూపాయలు చేరుకున్నా; యూరియా ధర 10శాతం తగ్గించన్నారు. ఎరువుల తయారీకి ఉపయోగించే ముడి పదార్థాల ధరలు తగ్గించడం; స్వేచ్ఛా మార్కెట్ ప్రవేశ పెట్టడం వల్ల మరో ఆరు నెలల్లో ఈ ధరలు తప్పక తగ్గుతాయని మంత్రి పేర్కొన్నారు. డీలర్ల వద్ద ఉన్న పాత స్టాకును కొత్త రేటుకు అమ్మితే కఠిన చర్యలు తీసుకొమ్మని జిల్లా కలెక్టర్లను ఆదేశించామన్నారు. దేశంలో ఎరువుల కొరత లేదని ప్రస్తుతం ఏర్పడింది, తాత్కాలిక కొరతేనని చెప్పారు. మారు మూల గ్రామాల్లో రైతులు సైతం ఎరువుల కోసం ఎటువంటి కష్టాలు ఎదుర్కోకుండా ఉండేందుకు ప్రతి చిన్న గ్రామంలో ఎరువుల దుకాణాలు తెరవాలని నిశ్చయించినట్లు తెలియజేశారు. చేనేత కార్మికుల జీవితాల్లో మార్పు తెచ్చేందుకు పెట్రో ఫిల్ సంస్థ సహకారంతో శిక్షణా శిబిరాన్ని చేనేత కార్మికుల ఉపయోగించుకోవాలని మంత్రి కోరారు. ఎమ్పీ కుమారి కె. పద్మశ్రీ, జిల్లా కలెక్టర్ శ్రీ కె. రాజా, జాయింట్ కలెక్టర్ శ్రీ జి. సాంబశివరావు, పెట్రో ఫిల్స్ ఎం.డి. శ్రీ జోషి, ఆత్మకూరు ఎమ్మెల్యే డా. సుందర రామరెడ్డి కార్యక్రమంలో పాల్గొన్నారు. ఈ శిక్షణా కార్యక్రమంలో కోవూరు, ఎ.ఎస్. పేట గ్రామాల చేనేత కార్మికుల శిక్షణ పొందారు.

## సెన్సార్

(9 పేజీ కొరవ)

అవస్థలో పడిపోయింది. ఒరవారి సత్రం వద్ద ఒక కారు చుట్టూ జనం మూగి ఉన్నారు. ఏమిటని వాకబు చేస్తే, అందుకు పావుగంట క్రితం ఆ కారును కొందరు దుండుగులు ఆపి, ప్రయాణీకుల నుంచి విలువైన వస్తువులు దోచుకున్నారట. అప్పుడు రాత్రి పదిన్నర. చుట్టూ చిమ్మచీకటి, ఆ దోపిడీ దంగలు దారిలో ఎక్కడో పొంచి ఉంది, తన కారును కూడా దోచుకుంటే అని సితార భయపడి పోయింది! ఆ రాత్రి అక్కడే ఎక్కడైనా ఉండిపోదామంటే వీలుపడదు. అందుచేత, ఎలాగో ధైర్యాన్ని కూడగట్టుకొని తన ప్రయాణాన్ని కొనసాగించిందట. అదృష్టవశాత్తు మద్రాసుకు క్షేమంగా చేరుకోగల్గింది.

## దర్శకత్వం వహించబోతున్న జమున

ఇటీవల 'ఎంకన్నబాబు' చిత్రంలో కనిపించిన జమున ఆంధ్రప్రదేశ్ ఫిలిమ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ డైరక్టర్లలో ఒకరు. ఈమె యామినీ కృష్ణమూర్తి రచించిన ''కృష్ణలీలలు'' నాటకాన్ని డి. కామేశ్వరి రచించిన ''డాక్టర్ అరుణ'' 13 ఎపిసోడ్స్ స్క్రిప్టును ''దూరదర్శన్'' కు పంపించారు. అవి ఆమోదింపబడితే వెంటనే స్వీయ దర్శకత్వంలో షూటింగ్ ప్రారంభించనున్నారు.

## కృష్ణ, నరేష్ నటించే ''పెళ్లాల రాజ్యం''

కొంత కాలం పాటు కాలమహిమ వల్ల కాస్త తెరచాటుకు వెళ్లిన కృష్ణ అప్పుడిప్పుడే మళ్లీ పుంజుకుంటున్నారు. అక్టోబర్ నుంచి వస్తే నవీన్ నిర్మించే ''పెళ్లాల రాజ్యం'' చిత్రంలో ఈయన సరసన జయసుధ నాయిక. నరేష్ కూడా ఈ చిత్రంలో ప్రధాన పాత్రధారి. రేలంగి నరసింహారావు దర్శకుడు.



వారి ఆమోదం పొందడం కానేకాదు ఒక చిన్న ఫార్మాలిటీ!
రేపు మీరు ఇల్లు కట్టుకొందామనుకున్నప్పుడు
తెలుస్తుంది ఆ రియాలిటీ!!

**DTP**

ఇల్లు కట్టుకోవడానికి ఋణ సౌకర్యం • మంచినీటి సౌకర్యం
అదీ ఓవర్ హెడ్ ట్యాంక్ ద్వారా • డ్రైనేజ్ సౌకర్యంతో 33, 40 అడుగుల
వెడల్పుగల W.B.M. రోడ్లు • కళ కళలాడే వీధి దీపాలు, కాలుష్యాన్ని
దూరం చేసే చెట్లు • హాస్పిటల్, ప్రార్థనా మందిరాలు, స్కూలు, పార్కుల
కొరకు కేటాయించిన స్థలాన్ని ప్రభుత్వానికి రిజిస్టర్ చేయడం

ఇన్ని సౌకర్యాలా
మేము ఇచ్చేది
ముత్తుకూరు రోడ్లోనే

బస్సు సౌకర్యం
పట్నాన్ని ఉండేదే
ఇక బహుమతులా
ఏ ఢోకా లేదు



**నిర్మల రియల్ ఎస్టేట్స్**

నిర్మల కాఫీ వర్క్స్ మిద్దెమీద, ట్రంకురోడ్డు, నెల్లూరు. ఫోన్లు : 22188, 29677

ఇంకా మీలో అసంతృప్తి ఉంటే పై అడ్రసులో సంప్రదించండి!

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zamin Ryot Press, Nellore OFFSET Printing at Nayagara Books (Pvt) Ltd.